

# లవ-కుశ నాటకము.



ఇయ్యది

కృష్ణలీల, భక్తకుచేల, సంపూర్ణ మహాభారతము మొదలగు

నాటకములు రచియించి కీర్తిశేషులైన,

బళ్ళారి పండిత క. సుబ్రహ్మణ్య శాస్త్రులవారిచే

రచియింపఁబడినది.



ప్రకటనకర్త:

సరస్వతీ బుక్ డిపో బెజవాడవారి అనుమతిని

**కొండా శంకరయ్య**

పుస్తకముల దుకాణము, మహాకాళివీధి,

సికింద్రాబాద్ (దక్కన్).

ఏడవకూర్పు 1000 ప్రతులు

ప్రీమియర్ ముద్రణాలయమున

ముద్రితము.

1946

కాపీరైటు రిజిష్టర్డు. పోస్టేజి ప్రత్యేకము. వెల **1-8-0**

# ప్రకటన.



మా తండ్రిగారిచే రచియింపఁబడిన యీ లవకుశ నాటకమునకు గల సర్వ స్వాతంత్ర్యములు క్రొత్త కాపీరైటు ఆక్టు ప్రకారము మాకుఁ జెందియున్నవి. కావున దీనిని భాషాంతరీకరణ మొనర్పవలయునన్నను ఖేలన మొనర్పవలయునన్నను ప్రచురింపవలయునన్నను మా యనుమతిని వ్రాతమూలమున పొందవలెను. అట్లుగాక స్వతంత్రించినవారలు మా నష్టములకు పాత్రులగుదురు.

15–9–38 }
కాకినాడ } పండిత కె. సుబ్రహ్మణ్యశాస్త్రులు అండ్ సన్సు.

# లవ-కుశ నాటకము.



## ప్రథమాంకము.



ప్రథమరంగము:—అయోధ్యాపురీరాజాస్థానము.
సీతారాములు సింహాసనాసీనులై యుందురు.
[వసిష్ఠాది మునీంద్రు లొకప్రక్కను, సుగ్రీవ విభీషణాదు లొక ప్రక్కను, భరత లక్ష్మణ శత్రుఘ్ను లొకప్రక్కను, సామంతరాజులును పురజనులు నొకప్రక్కను కూర్చొనియుందురు]

అందఱు—(లేచి నిలువఁబడి చేతులు జోడించి)

(అనుబంధము 1.)

భరత—సభాసదులారా! పౌరులారా! నేను తమతో సంపూర్ణసంతోష భావమున మాటలాడఁ గలిగినందున కిచ్చట సింహాసనమున వెలుఁగొందు శ్రీరామభద్రుఁడే కారణము. ఈ మహానుభావుఁడు పితృవాక్య పరిపాలన మొనర్చుటకై పదునాలుగు వత్సరములు వనవాస మొనర్చుటయు, పుత్ర వ్యామోహమున మా తండ్రి దశరథరాజేంద్రుఁడు స్వర్గ నివాసి యగుటయు, అనంతరము నేను శ్రీరామచంద్రుని మఱల నయోధ్యకు చనుదేఱ ప్రార్థింపఁ జిత్రకూటమున కేగుటయు, అందులకు నాతఁడు సమ్మతింపక నా వేఁడికోలువలన తన పాదుకల నాకర్పించుటయును, నే నా పాదుకలకే యయోధ్యాపుర రాజ్యపట్టాభిషేక మొనర్చి యింత వఱకును ధరను పాలించుటయు, మీకెల్లరకును విదితమే గదా! ఇంతవఱకు నీ దొరతనమెట్లు మీ మది కెక్కియున్నను నది యంతయు శ్రీరామపాదుకా ప్రభావ మనియే యెఱుఁగవలయుఁ గాక వేఱుకాదు. ఇదివఱకు రామాగమన వార్తవిని పల్లవించి

పుష్పించియున్న మన భాగ్యతరువు నేడు శ్రీరామ దర్శనము వలనను, అతఁడు మనలను పరిపాలింపఁ గలిగినందుననను ఫలించి మన పొగడికోలు వడసియున్న దనుటకు సందియము కలదే? ఇదే నా మాణిక్య పాదుకల మఱల రఘురాము పాదములఁ జేర్పువాఁడను. (అని పాదుకలను రామచరణములవద్ద నిడి)

మ. ఇనవంశోత్తమ నీదుపాదుకల కే నిందాక దాసుండనై
ఘన రాజ్యంబును నేలగల్గితిని నే గన్గొంటి నిన్నిప్పుడున్
గొనుమా వీరె ప్రజల్ జనాధిపులు నీకున్ రాజ్యమర్పించెదన్
ననుఁ గారుణ్యముతోడఁ బెంపవె, దయన్ పాలింపవే రాఘవా.

శ్రీరామా! లోకాభిరామా! మీయానతిచే మీ పాదుకలకు సేవకుఁడనై రాజ్యమును పాలించితిని. ఇదిగో! మీరిచ్చిన యీ ధరా భారము నంతయు మఱల మీచరణసరోజముల కర్పించుచున్నాఁడ ఇదేరాజ్యము. వీరే ప్రజలు. ఇయ్యది వే రాజ్యలక్ష్మి వీఁడే మీ దాసుఁడగు భరతుఁడు విన్నవించుచున్నాఁడు. అనుగ్రహింపుఁడు. (అని నమస్కరించును.)

శ్రీరామ—అన్నా! భరతా! నీభక్తి, నీస్వప్రయోజన నైరస్యమును, యెంతయు కొనియాడదగినది గదా?

సీ. అఖలసామ్రాజ్యంబు నావల పోద్రోలి
నీభక్తి నాపైన నెఱపితన్న
నంది గ్రామమునందు నాకునై నారచీ
రలుగట్టి వ్రతములు సలిపితన్న
నారాక తడవైన నాకునై ప్రాణముల్
నీగగా వడి ప్రయత్నించితన్న
నినుఁబోలుతమ్ముని వసట గుందించితి
నంచు నెమ్మదిలోన నుంచకన్న

తే. గీ. ఇన్నినాళ్ళకు నిన్ను నేఁ గన్నులార
చూడఁగంటిని యిది నాకు సుదినమన్న
సకలజనహిత, సత్కృపా సతతకలిత
భవ్యగుణయుత, మోక్షభక్తిభరిత భరత.

వసిష్ఠ—సభ్యులారా ! పౌరజానపదులారా ! ఆలకింపవలయు. నేను కొంతకాలముక్రిందట, సర్వలోకేశ్వరుఁ డగు నీ కోదండ రామునకు పట్టాభిషేకమహూర్తమును నిశ్చయించియుంటిని. అది యిప్పుడు నెఱవేఱదయ్యెనని కొందఱిమానసముల శంక గలిగియుండవచ్చును. దాని యభిప్రాయమును వెల్లడిపఱచి యా సంశయమును బాపుట నాకెంతయు ముఖ్యకర్తవ్యము. ఈమహనీయమూర్తియగు శ్రీరామ మూర్తికి సమస్తలోక రాజ్యపట్టాభిషేక మొక్కటియు,నయోధ్యా రాజ్యపట్టాభిషేక మొక్కటియు నవశ్యము చేయఁ దగినవిగా నున్నవి. రాజ్యపట్టాభిషేక మనగా రాజ్యమునందలి కష్టముల, దుష్టులొనరించెడి బాధల మాన్పిగదా ప్రభువగువాఁడు నా దొర తనమునకు పట్టాభిషిక్తుఁడగుట ? కావున సర్వలోకములు రావణ విరాధాది రాక్షసులచే నెంతయు గారింపంబడుచుండ నాయిడుముల దొలఁగించి రక్షించుటకై శ్రీరామభద్రున కానాఁడు నే నొక పట్టాభిషేకసుముహూర్తము నిశ్చయించితిని. అందులకై యే యీ సర్వేశ్వరుఁ డీభూమిని చరించి, వక్త్రకంధరాది దానవులఁ బరి మార్చి, పట్టాభిషేక శక్తిని నెల్లెడల విశదీకరించెను. ఇఁక ఇప్పు డన్ననో యీ దేవదేవునకే యయోధ్యాపుర దొరతనమును పట్టాభి షేక మొనర్చుట నిశ్చయింపఁబడినందున నమ్మహోత్సవ దర్శన కుతూహలముననే మనమందఱ మిందుఁ జేరియున్నారము. ఈతని సర్వలోక ప్రభుత్వమును వెల్లడి పఱచుటకై యే నానా దేశాధీశ్వ రులు చనుదెంచియున్నారు. సమస్త వానర సార్వభౌమత్వమును సూచించుటకై వానర రాజ్యాధిపతియగు సుగ్రీవుఁడు వచ్చియు

న్నాఁడు. దానవచక్రవర్తిత్వమును బ్రకటించుటకై పరమదాసుఁడగు విభీషణుఁడు చనుదెంచియున్నాఁడు. ఈ రఘుకులభూషణుఁడు వాచామగోచరప్రభావుఁడు, ఎల్లలోకములందును వసించువాఁడయ్యు దేనిని నంటని నిరంజనమూర్తి. ఇఁక పరిపాలనా శక్తియందన్ననో శ్రీ లక్ష్మీపతియే యనవచ్చును. ఇట్టి వేదాంతరాముని, త్రిలోకాభిరాముని, వైకుంఠధాముని, సకలసద్గుణస్తోముని, జానకీమనఃకాముని, ప్రభాసోముని, రాముని రాజుగాఁ గంటిమి. ధన్యులమైంటిమి. ఇదే మీయానతిచే నభిషేక ముహూర్తమును నిర్వర్తించుచున్నాఁడను. (అందఱును నిలుచుందురు. మునులు మంత్రముల నుచ్చరించుచు నభిషేకముఁ జేయుదురు.)

సామాజికులారా! ఏకిరీటము సూర్యవంశమున జనించిన వైవస్వత మనువుశిరమునందు వెలుఁగొందెనో, ఏకిరీటరాజము దిలీపరాజేంద్రు మస్తకమున రాజిల్లెనో, ఏమకుటము రఘుమహీధవు నుత్తమాంగమున నొప్పారియుండెనో, ఏమణిమయకిరీటవతంసము హరిశ్చంద్రు కందమున నెంతయు వాసిగాంచెనో, ఏకిరీటము దశరథ భూపాలశిరోభాగమున విభాసించియుండెనో యాకిరీటశ్రేష్ఠము నిప్పుడు శ్రీరామచంద్రునకు ధరింపఁజేసెద. (అని కిరీటమును శ్రీరామునకు ధరింపఁజేసి) శ్రీరామభద్రా! మీతాత ముత్తాతగారగు సగర, రఘు, దిలీపాదు లెట్లు భూవలయంబు పాలించి కీర్తి వడసిరో అటులనే యాచంద్రార్కముగ నీభూచక్రము నేలుము.

అందఱు—(నిలుచుండి)

(అనుబంధము 2)

శ్రీరామ—వసిష్ఠసంయమీంద్రా! మాసూర్యవంశమునకు హితుఁడవై, పురోహితుఁడవై, యెనలేని కనికరమున మావంశమువారిని నీయాశీర్వచన ప్రభావమున నెంతయో కాపాడి సాటిలేని కీర్తిని ఘటించి యింతవఱకు మనిచితివి. ఇఁక పరమశిష్యుఁడనై యేమియు

దెలియని పసివాఁడనై యున్న నన్నును సంపూర్ణానుగ్రహము కలిమి నిలాభారము నిచ్చి రాజ్యపట్టాభిషిక్తునిఁ జేసి పరిపాలించు టకై కంకణముఁ గట్టుకొని యున్నాఁడవు. మునిచంద్రమా! పరమ విజ్ఞానధనులగు తమరింత నన్నుఁ గృతార్థునిఁ జేయబూనుట తమ నిర్వ్యాజ్య కరుణామహాత్మ్యమును సూచించుచున్నదికదా?

ఉ. నీదయచేతగాదె యటవీస్థలి సేమముతోడనుంటి మీ
యాదరమందిగాదె దనుజాధిపు రావణుఁ ద్రుంచగంటి నీ
సాదరబుద్ధిగాదె యిటుతాత్మతలరాజ్యము నేలఁబూనితిఁ
మోదముమీర బ్రోవవె విమోహముబాపి మునీంద్రచంద్రమా.

పౌరులారా! దేశాధీశ్వరులారా! సుగ్రీవ విభీషణులారా! మానులారా! మీరందఱు నన్నింత గొప్పఁజేసి యీ భూభారమును వహింపుమని వేఁడికోలిచ్చుట నాయందు మీకుఁగల వరమాదరణ విశేషముగాక వేరుండునే? తమయానతి శిరసావహించువాఁడ. మీయందఱ సాహాయ్యముననే గదా నేనిట్టి ఘనకార్యమునకుఁ బూనియుండుట! నేను వర్ణాశ్రమాచారాది ధర్మముల యథారీతి పాలించువాఁడను. పక్షపాతమును మదియందు చొరనివ్వను. మత వైషమ్యముల గ్రహింపను. ప్రజా సముదయముయొక్క యభిప్రాయానుసారముగ రాచకార్యముల నిర్వహించెదను గాని స్వాతంత్ర్యమూని పాలించుటకెన్నఁడును సాహసింపను ప్రజలారా! ఇదె ప్రమాణముఁ జేయువాఁడను. నాతమ్ములు భరత, లక్ష్మణ, శత్రుఘ్నులకంటెను, నాయనుంగు పుత్రులకంటెను, నాబంధుల కంటెను, నాప్రజలే నాకు మిక్కిలి ప్రీతిపాత్రులు.

సీ. రఘురాజునాదిగా రాజులౌ మమ్ముల
వరప్రేమఁగూర్చు నోభవ్యులార
ఏ కొంటతయు లేక నే పాపమును లేక
ఘనరీతివర్తించు సనఘులార

వనమున కేనేగ వనటచే నావెంట
చనుదెంచినట్టి యోసదయులార
మీయనుగ్రహముచే నీయయోధ్య సుఖమ్ము
మీర చేరఁగ గంటి ధీరులార

గీ. మిమ్ము వంచించి మత్తిపృతుమ్ము నీడ
పోయితిని నన్ను మన్నించి బ్రోవుఁడయ్య
భూరియశులార ! సద్గుణాధారులార !
ధీరవరులార ! సాకేత పౌరులార !

ఈ రాజ్యమునకు ముఖ్యమంత్రిగా నాసోదరుఁడును సకల సద్గుణకలితుఁడును, మద్భక్తిభరితుఁడును నగు భరతుని నియమించియున్నాను. భరతా! నాయానతిచేఁ గైకొమ్మధికారచిహ్నమును. (భరతుఁడు ఖడ్గమును తీసికొని వందనముచేయును.) లక్ష్మణా! మన రాజ్యము నందలి సేనాసముదయంబులకు నాయకుఁడవై, దండ నాయకుఁడుగా నాకు సహాయమొసర్పుము.

లక్ష్మణ—భాగ్యము, (అని ఖడ్గము తీసికొనును.)

శ్రీరామ—శత్రుఘ్నా! రమ్ము. నీవు నాశరీర రక్షకుఁడవై, దండ నాయకుఁడవై యెల్లకాలము నన్ననుసరించి యుండుము.

శత్రుఘ్న—భాగ్యము.

శ్రీరామ—సుమంత్రా! నీవెప్పటి విధంబుననే మావంశమువారి కెట్లు మంత్రివై రాజ్యమును పాలింపఁజేసితివో అట్లునన్ను సైతమాదరించుచు నీవును మంత్రిపదంబుననే యుండుము.

సుమంత—భాగ్యము.

వసిష్ఠ—ఎవ్వరైన నీశుభసమయమునందు కట్నములు చదివించువారున్న నియ్యవచ్చును.

జనక—మానీంద్రా! చిరకాలము నుండి యేదంపతులు నాకు దర్శన మొసంగక యింతకాలమునకు తమదివ్య సన్నిధానమున మాకండ

అట్టి పరమామోదము ఘటించిరో, యేదంపతులు నేత్ర వికసన మాత్రమున జగంబుల సృజించి, నిమీలనమాత్రమున తమయందు లీనమొనర్పఁజాలుదురో, యేదంపతులు లోకహితార్థమై భూమిని జనించిన వారై దుష్టనిగ్రహ మొనర్పఁజాలిరో, అట్టి దంపతులకు సర్వవేదములు, సర్వశుభదేవతలు భూమ్యాకాశము లెపుడును శుభమొసంగుగాత! ఇదిగో! ఈమాణిక్యహారములను చదివింపుఁడు.

వసిష్ఠ—సభాసదులారా! సకలరాజర్షిచంద్రుఁడై, మిథిలాపురాధీశుఁడై, పరమసుజ్ఞానశిఖామణియైన యీ జనకరాజేంద్రుఁడు శ్రీరామపట్టాభిషేక మహోత్సవకాలమునఁ దనపుత్రికామణియైన సీతాదేవికి తనయల్లుఁడైన శ్రీరామునకు యీమాణిక్య హారముల నొసంగి యాశీర్వదించియున్నాఁడు.

విభీషణ—మునిచంద్రా! ఈ ముత్యములహారమును సీతారాములకుఁ జదివింపుఁడు.

వసిష్ఠ—లంకాపురాధీశుఁడగు విభీషణుఁడు తన స్వామియగు శ్రీరామచంద్రునకు ముత్తియముల హారమును చదివింప నిచ్చియున్నాఁడు.

సుగ్రీవ—దేవా! ఈయంగదముల జానకీరాములకుఁ జదివింపుడు.

వసిష్ఠ—కిష్కింధపురాధీశుఁడై వానర చక్రవర్తియైన సుగ్రీవుఁడు యీమహోత్సవకాలమున సీతారాములకు నమస్కరించి యీభుజకీర్తుల నొసగియున్నాఁడు. ఇంక బహుమానముల నిచ్చువారందఱును రేపు ప్రాతఃకాలమున నివ్వవచ్చును.

(ప్రవేశము: ఆకాశమున దేవదూత)

దేవ—స్వస్తి శ్రీరామచంద్రునకు! దేవా! ఈ మందార మాలికతో నీ దివ్యకంకణములను దేవేంద్రుఁడు పంపియున్నాఁడు.

వసిష్ఠ—అయిన నీమహేంద్రుని బహుమానము మాత్రమిప్పుడు చదివింపవచ్చును. (అని హారమునుగొని) ఇట్టి శుభమహోత్సవకాలమున త్రిలోకరక్షకుఁడగు శ్రీరామచంద్రునకు దేవేంద్రుఁ డీహార

మును చదివించియున్నాఁడు. (అని శ్రీరాముని చేతికిచ్చును. శ్రీరాముఁడు దానిని సీతకొసంగును.)

శ్రీరామ—జానకీ! ఏమిట్లూరకున్నదానవు? నీముఖభావము చూడ నేదోయొక సంపూర్ణాభిలాషను సూచించుచున్నది. చెప్పుమా నీ కోరికను. అది యెట్టిదైనను మానక చేయువాఁడను. ఓహో! తెలిసెను. ఏల సంకోచించెదవు? అవశ్యము నీకు భక్తుఁడై, నీ మనస్సంతోషదాయకుఁడై, నీపరమ కరుణారసపాత్రుఁడైయున్న వానికామాణిక్యహారమిచ్చుట నీకుగాదెల్లరకును సంతోషమేకదా?

మ. అళినీలాలక! యేలసందియము నీకాప్తుండునై, భృత్యుఁడై
యిలభక్తుండయి, పుత్రుఁడై వెలయువాఁ డెవ్వాఁడో యాధీరునిం
లలి నీహారము నిచ్చిగౌరవము చెల్వారంగ పోషింపుమా బలు
మోదంబొనగూర్పుమా పిలువుమా భామా కృపాపూర్ణమా.

సీత—దేవా! అట్లైన కృతార్థనైతిని. అంజనాతనయా! రమ్ము.

(అనుబంధము 3)

సభాసదులారా! ఏకపివీరుఁడు మహార్తిచేఁ బరితపించుచున్న శ్రీరామచంద్రునకు పరమదాసుఁడై సుగ్రీవుతో చెలికారము వాటించెనో యే ధీరశిఖామణి మహాసముద్రమును గోష్పదమువలె దాటి లంకిణి మదమణచెనో, యే బ్రహ్మచారి లంక నంతయూ వెదకి యశోకవనమును పరికించి యందతిశయశోక సముద్రమున మునిగియున్న నన్ను నావయై దరిఁజేర్చెనో, యేవీరవరుఁడు రావణాదికౄరులకు హృదయశల్యమై రాజిల్లెనో, యేభక్తశిఖామణి శ్రీరామభక్తాగ్రేసరుఁడై రామతారక బ్రహ్మానందమున చొక్కుచుండునో అట్టి వాయునందనుఁడు నాకు కూర్మిపుత్రుఁ డగుటచే నతనికీ ముక్తాహారము నొసంగెదను. అన్నా మారుతీ! నీయుపకార విశేషముననేకదా మేమందఱ మిందు చేరగంటిమి? నీకరుణావిశేషముననేగదా లోకములన్నియు చల్లపడెను. ఈమౌక్తికహారముచేత నిన్ను సన్మానించుదానను గైకొమ్ము ముక్తాహారమును.

సీ. మునుమున్ను సుగ్రీవు ఘనమైత్రి రాముకు/
కలుగఁజేసిన దయా ఘనుఁడ వీవె
వనధిని లంఘించి వరరాముముద్రిచే
ననుఁ బ్రోవఁ గల్గిన యనఘుఁ డీవె
శ్రీరామునకు నాదు సేమంబుఁ జెప్పి మా
ణిక్యమిచ్చిన మహనీయుఁ డీవె
రావణు శక్తి మూర్ఛనుగన్న సౌమిత్రి
ప్రాణంబులిచ్చిన ప్రౌఢుఁ డీవె
గీ. ఇపుడు చనుదెంచి భరతు జీవింపఁజేసి
నట్టిదాతవు నీవె దయాఢ్యుఁ డీవె
మమునయోధ్యకుఁ జేర్చిన మాన్యుఁ డీవె
అఖలజనగేయ ! సువిధేయ ! ఆంజనేయ !

(అని కంఠమున వైచును)

ఆంజనేయ—(శ్రీరాముని వంక చూచును.)

శ్రీరామ—కుమారా ! ఏల సంకోచము ! వైదేహమ్మ. నీకియ్యతగని వస్తువు ముల్లోకమున కలదే ?

ఆంజనేయ—(నమస్కరించి) అమ్మరో! సకలలోకజననివై, చిఱునవ్వు మాత్రమున లోకముల సృజించి, కనుబొమ ముడియిడినమాత్రమున లయముచేయు సర్వక్రియా శక్తిస్వరూపిణివగు నీకు నుపకృతి యనఁగ నేమి ? చేయువాఁ డనఁగ నెవ్వఁడు ? నాచే లంకను దహింపఁజేసి, రామునిచే రావణాదుల పొలియింపఁజేసిన వీరశక్తివి కావా నీవు? నీకృపావలోకనమే మోక్షసతీ పురద్వారము కాదా? నీదరహాసమే వైకుంఠ చంద్రశాలా సోపానముకాదా ? తల్లీ! నీ వీముక్తాహారము నొసంగుట లోకమున నెనలేని యశము నాకుఁ జేకూర్చుట కయ్యేగదా ? ఈ హారమును నేనేమి చేయుదును ? అఖిలలోకమాతా! అజస్రవేదసీమంతినీసీమంతా ! అనుపమానగుణ

జాతా ! అపగతవిభీతా ! జనకవిజ్ఞానజాతా ! అళినీలాలకవ్రాత ! సీతా ! నానాదుఃఖమయమగు నీ ప్రపంచసాగరమునుండి న న్నుద్ధరింపుము. ఇదియే నాయభిలాషము. ఇందొక్కటి యనుగ్రహించినఁ జాలును. అమ్మరో ! నాకేల ముత్యములహారము ? కోతికేల ముత్తెములదండ ? రామతారక ముపదేశించి తరుణోపాయము కలిగించి నన్ను గృతార్థునిఁ జేయుము. లోకము శ్రీరామమయము. లోకాంతరము శ్రీరామమయము. లోకాలోకము శ్రీరామమయము. బ్రహ్మలోకము, ఆనందలోకము శ్రీరామ మయముగఁగాంచు నాకీ దండయందు రామనామాక్షరములు లేవే? శ్రీరామనామామృతము లేదే ? శ్రీరామతత్త్వార్థము లేదే ? దీని నేనేమి చేయుదును. వలదు. నాకేదియు వలదు. రామవిద్యాసార మనుగ్రహింపుము నన్ను గృతార్థునిఁ జేయుము.

సీ. నీదర్శనంబె మానితతపఃఫలసిద్ధి
విసరదాయక కల్పవృక్షమమ్మ
నీకృపాలోకమే, నిరతశ్రీకైవల్య
పట్టణ వరముఖ ద్వారమమ్మ
నీయనుగ్రహమె యానిత్యమోహతమిస్ర
భంజనచంద్రికా ప్రసరమమ్మ
నీదరహాసమే నిఖిలయోగిమనోబ్జ
ప్రకటరవిమహః ప్రభగదమ్మ
గీ. నీదుపదసేవ వేద మాణిక్యమమ్మ
వరగ నీధ్యానమే ముక్తి భాగ్యమమ్మ
పరమ శ్రీరామతారక బ్రహ్మవిద్య
చెలగి నాకిచ్చి ధన్యునిఁజేయుమమ్మ.

(అనుబంధము 4)

సీత—(శ్రీరామునిఁజూచి) రామభద్రా! నీభక్తుని కోరిక కొనసాగింపవలదే? భక్తుల యభిలాషము దీర్ప నిదియే కదా సమయము.

శ్రీరామ—జానకీ ! ఈ భక్తశిఖామణి నిన్ను కోరుచున్నవాఁడు గాక నన్నేమియు ప్రార్థింపలేదే ! ఒకవేళ ప్రార్థించినను వాని కోరికలు మూటగట్టి యిచ్చుటకు నావద్ద నేగుణమును లేదే? గుణములేని వాని లోకమున నాశ్రయించువారెవరు?

సీత—రామా ! నీవద్దలేని గుణమెయ్యది కలదు ? అన్ని గుణములు నీవి కావా ? ఇంతకును నీదాసుఁడు నీవద్దనుండు యీ నిర్గుణానందమే కదా కోరుచున్నవాఁడు ? దాని దయచేయుము. ఈ పరమభాగవత శిఖామణి హృదయము నుప్పొంగఁ జేయుఁడు.

శ్రీరామ—సీతా! నీకుమారునకై యెంతప్రయాస పడుచున్నదానవు ? అటులనే కానిమ్ము. నీమాట నేను తీసివేయుదునా? ఆంజనేయా! ఏమేమో నీజననితోఁ జెప్పుచున్నావే? అదేమో నాతో వచియింపరాదా ?

ఆంజనేయ—దేవా ! లోకమునఁ గుమారులు మొదట తల్లితోనే చెప్పికొందురు. ఆజననియే తండ్రితో చెప్పి పుత్రికుల కోర్కెల కొనసాగించును. ఇందేమి విరుద్ధమున్నది?

శ్రీరామ—ఓహో ! లోక మర్యాదను చక్కఁగ ననుసరించితివి. తెలుపుము నీకోరిక యెయ్యది?

ఆంజనేయ—శ్రీరామమూర్తీ! నీకుఁ దెలియని నాకోర్కె కలదా?

శ్రీరామ—అట్లనా! అంజనాతనయా! ఏదీ నీచేతియందుండెడి హారమును చక్కఁగ నొక్కసారి చూడుము.

ఆంజనేయ—(హారమును పరికించి) ఔరా ! దొరికె నా తపఃఫలము. లభించె నా మోక్షవిధానము ప్రాప్తించె నా తారకనామము. నేఁడుగదా ధన్యుఁడ. నేఁడుగదా కృతార్థుడ. నేఁడుగదా మోక్షసతీ సామ్రాజ్యమునొందగంటిని !

(అనుబంధము 5)

శ్రీరామ—మారుతీ! ఏమి పిచ్చివానివలె నటించెదవు? లోకమున లేనియద్భుతము నేమైనఁ గంటివా?

ఆంజనేయ—(శ్రీరామా! దివ్యతేజోధామా! వైకుంఠధామా! మోక్షకాంతాసదారామా! వేదాంతసీమంతినీకృతనామా! సనకసనందనాది మనస్థేమా! జానకీరామా! జగదభిరామా! పట్టాభిరామా దనుజభీమా! రవికులసోమా! నీవెఱుఁగని చోద్యము కలదే! చోద్యము కంటిని. చోద్యములలో సారముకంటిని. సకల ప్రపంచ సారము కనుగొంటిని. (హారమును కనులకొత్తికొని) ఆహా! ఈ హారమునందలి ప్రతిమౌక్తికమునందును నీదివ్యరూపమే కనుపించు చున్నది. కల్యాణరామా! ఏమి నీభక్తవాత్సల్యము? ఏమి నీ మహామహిమము? కృపావరిపూర్ణమై, అనిరూపిత ప్రభావమై, అనుపమతేజస్సారమై, అనురూపిత వేదతత్త్వార్థమైన ప్రకాశము నెల్లెడ చూడఁగంటిని కదా? సర్వదిశలు శ్రీరామమయము, సమస్తలోకములు శ్రీరామమయము. దేవా! నినుఁదెలియ నే నెంతవాఁడను! ఓరఘురామా! నీ కేపూజోపహారము నొసఁగుదు? నాశరీర, ప్రాణ, మానస, భక్తినిధానముల నీ చరణ సరోజముల కర్పించువాఁడ. (అని శ్రీరాముని పాదములపైఁ బడును. శ్రీరాముఁ డతని శిరముపై చేయినిడును)

అందఱు—(నిలుచుండి)

(అనుబంధము 6)

ప్రథమాంకము—ద్వితీయరంగము.

అయోధ్యాపురిబయలు.

[ప్రవేశము—శూర్పణఖ]

శూర్పణ—ఔరా! ఇదియే అయోధ్యాపట్టణము! దీన నేఁడెంత సంభ్రమముగా నున్నది? వీథులన్నియు పన్నీటిజలముచే చల్లఁ బడియున్నవి. మేడలు, సౌధములు మిక్కిలి శృంగారింపఁబడి యున్నవి. ఈయింటింట పచ్చతోరణములేమి; చిత్రలేఖనములేమి;

ఆముత్తైయములు ముగ్గులేమి; ఆదేవతాసమారాధనము లేమి; కన్నుల కెంతయో పండువుగానున్నది. ఈపురకామినులును పురుషులును ఆవైకుంఠపదవియే తమకబ్బినట్లెంతయో విఱ్ఱవీగుచున్నారు. నిన్నగదా ఆ రామునికి పట్టాభిషేకము ముండమోసియుండుట? ఆహా! తలచుకొన్నంతనే కడుపున దవానలము పెట్టినట్లగుచున్నది గదా ? ఏమిచేయుదును ? నామంట యెట్లుచల్లారును ? నేనిప్పుడే పోయి యీరాముని మెడ నలది వానిసతి మంగళసూత్రము నట్టె త్రెంచునటులను నాకు నిద్రపట్టనేర్చునే ? (కొంచెము యోచించి) అయ్యో! అదియెట్లు చేకూరును? నాసోదరులనందఱిని వాని నోటికి బలియిచ్చితిని. మా రావణునంతటివాఁడు వీనిబారి కోర్వఁజాలక మృత్యువువాతఁబడియె. నాబలగమంతయు నశించె. నా పుట్టినింటికి లంకకు కల్లకొట్టినట్లయ్యె. ఆ విభీషణుఁడను దాసేయుఁడు బ్రదికి యున్నను పగవానిపంచనుఁబడి జీవించుచున్నవాఁడు. ఈరాముఁడు మా కులమునకె మారియై పుట్టియున్నవాఁడుగదా ? నాపగ సాధించుటకై రాత్రింబవళ్ళు నిద్రాహారముల నెఱుంగక యీసీతారామలక్ష్మణుల వెనువెంట మారువేషమునఁ దిరుగుచు సమయము దొరకక యీ పట్టణముచెంతకు వచ్చితినికదా ? ఇంత శ్రమపడి వచ్చి యేమి సాధించినట్లయ్యె ? (యోచించి) అయ్యో! చేయుటయా ? ఆ యాంజనేయుఁడను కోఁతి వారినిఁ బాసినగదా నే నేమైనఁ జేయుట? ఔరా ! ముల్లోకములను వీక్షణ మాత్రమున ధ్వంసమొనర్పఁజాలు నీ శూర్పణఖ యొక్క మానవుని నొంచుటకై యింత శ్రమింపవలసివచ్చెఁగదా? మాలంక రాక్షస రక్త ప్రవాహమున మునిగినట్లే యయోధ్యాపట్టణ మంతయు నిరంతరశోణిత వారిపూరంబున మునిఁగి తేలుచుండ, ఆ సీతారామలక్ష్మణుల మాంసరక్తములఁగొని, పితృతర్పణమొనర్చినఁగదా చని స్వర్గమున నున్న మా రావణాది రాక్షస బంధువర్గమునకు నుత్తమలోకములు

కలుగును? (ఆలోచించి) అయ్యో! "దరిద్రునికోపము దౌడలచేటు" అన్నట్లు నోరూర కోరికలఁగోరిన నేమిప్రయోజనము? ఉప్పుకల్లు బోలె నేనొక్క తెగదా జీవించియున్న దానను? నావగ సాధించు టెట్లు? ఒక్కటితోఁచుచున్నది. ఎట్టులైన మోసమున నే నావని సాధింపవలయు. ఆమోసము మాత్రము సాధారణమా? ఎట్లు పన్నవలయు? మాయావేషముఁ బూని మఱియు సీతారాముల నెడబాపవలయునని తోఁచుచున్నది. ఇదినాకొక్క యబ్బురమా? ఇదివఱ కెందఱెందఱు దంపతులనో యెడబాపియున్నాను. కాని, యిచట మాజాతివాఁడొకఁడు చేరియున్నవాఁడు గావున సందేహించుచున్నాను. ఆ విభీషణునకు కనుమరగించి యీ కార్య మొనర్పవలయు. అయిన నిది బహుకష్టసాధ్యమగుపని. కష్టసాధ్య మననేల? అసాధ్య మన్నను అనవచ్చును. ఇంతకును నాకు తోడొక్కరును లేరే? యేమిసేయవలయును? అదేమి గ్రహచారమో కాని నే నేకార్యమును చేయఁబూనినను వ్యతిరేకమే యగుచున్నది. ఆనాఁడు రామలక్ష్మణుల వరింపఁబోయి ముక్కు చెవులను పోగొట్టుకొంటిని. మఱల ఖరదూషణాదుల బంపి రామునిఁ జంపయత్నించి తుదకు వారి నే యముని యింటి కంపితిని. మఱల రావణునకు సీతపై మోహమును గల్పించి యామె నెత్తుకొని వచ్చునట్లు చేసి వానిపేరు లేకుండఁ జేసితిని. ఇపుడీకార్యమును జేయనెంచి యింతదూరమువచ్చితిని; దీన నే యనర్థము రానున్నదో తెలియదు. ఇచ్చట నామాటలను వినువాఁ డెవ్వఁడును లేడుకదా? (నలుప్రక్కల చూచి) ఎవడక్కడ; ఇచ్చటికేవచ్చుచున్నాఁడు? వీడేమైన నామాటల వినియుండునా? (కొంచెము ముందుకు పోయి) ఆహా! వీఁడు మా విద్యుజ్జిహ్వుని తమ్ముఁడు కరాళుఁడు. వీఁడిచ్చటికేల వచ్చియుండును? వీనితో మాట్లాడి వీఁడేమైన నాకు సహాయ్యమగునేమో చూచెదనుగాక!

(ప్రవేశము:—కరాళుఁడు)

కరాళ—(శూర్పణఖను జూచి సంభ్రమముతో) ఏమి శూర్పణఖా! ఇందేలయున్నావు? నిన్ను వెదకివెదకి వేసరితిని! ఇప్పుడు యెటులనో నాపుణ్యవశమున దొరికితివి. ఏమైనది నీప్రయాసము? రామలక్ష్మణులు దొఱకిరా?

శూర్పణ—నీవంటిచేతగాని రాక్షసపందలున్న దొఱకిననేమి దొఱకకున్ననేమి?

కరాళ—ఏమి అంత వేసరికతో మాటలాడుచున్నావు; నీ కోరిక ఫలియింపలేదా?

శూర్పణ—విషమో, అగ్నియో, జలమో దొఱకినఁగదా నా కోర్కె సఫలమగుట?

కరాళ—అవియేల?

శూర్ప—వాటితో మడసి నేనును నాయన్న రావణునొద్ద జేరుటకై.

కరాళ—అంత దుర్మరణము నొందు పనియైన నిప్పుడేమి? రామునిపై పగ సాధించు టేమాయె?

శూర్ప—పగయా? సాధించుటయా? ఉన్న రాక్షసులందఱు రాముఁ జేరియుండ నిఁక సాధించువా రెవరు?

కరాళ—అటులేల? ఉన్నవారే సాధింపవలయు?

శూర్ప—ఇఁక నున్నవా రెవరు? విధవ యగు నే నొక్కతెగదా యుండునది?

కరాళ—శూర్పణఖా! ఏల యిట్లు మాట్లాడెదవు? నీవొక్కతె నేనొక్కఁడనుగదా మిగిలియున్నవారము? మనమిప్పుడె పోయి యీ యయోధ్యాపురివారి నందఱిని మ్రింగుదము. రాముఁడు వచ్చినా యుద్ధమువలదు. ఏమియువలదు. ఊరక నోటిలోన వేసికొందము.

శూర్ప—చాలు నింకూరకుండుము. నీవలెనే బొర్లపడిన మఱెందఱో గ్రుడ్డువెట్టిరి. ఇది సరియైనపని కాదు. పౌరుషముతో మనము పగ సాధింపఁజాలము. ఏమైన సాధింపవలయునన్న మోసముతోనే.

కరాళ—అదియును సరియే. ఏమిమోసము చేయుదము ?

శూర్ప—ఏమియు వలదు. సీతయున్నదిగదా? ఆముండ నెటులైనను రాముని చెంతనుండి యదలింపవలయు.

కరాళ—అదెంతటిపని ? నేనిప్పుడె పోయి యవలీలగ దానినెత్తుకొని వచ్చి నీకొప్పగింతునా ?

శూర్ప—నీపుణ్యము. ఊరకుండుము. మొదటివలెకాదు. ఆ జానకిని యెల్లప్పుడును ఆంజనేయుడను కోతి కాచుకొనియుండును. కావున దాని నెత్తుకొనివచ్చుట నీచేతకాదు. నీ ప్రపితామహునిచేత కూడ కానేరదు.

కరాళ—(యోజించి తెలియనివానివలె) ఆంజనేయుడు ?

శూర్ప—(చిరునవ్వునవ్వి) సరిపోయె. ఆంజనేయునే యెఱుగవా? మన యక్షయకుమారుని మ్రింగి మనలంకకు నగ్నిపెట్టి, అనేకులగు రక్కసులను మర్దించెనే వానినే మఱచిపోయితివా ? వాని నుండియేకదా మనకింత చేటుకలిగినది ?

కరాళ—వాడా ? తెలిసెను. అయిన నిపుడేమిచేయవలయునని యనుకొన్నావు ?

శూర్ప—మన మిరువురము (కొంత చెవిలోచెప్పి) వేషముల వేసికొని సీతపై యపనింద పుట్టించి రాముడే సీత నెడబాటుచేయునట్లు చేయవలయును.

కరాళ—ఇది బాగుగ నున్నది. అటులనే కానిమ్ము. ఇక కార్యమును వేగిరింతమురమ్ము. ఈమార్గముననే పురిలో ప్రవేశింతము. (ముందు చూచి) శూర్పణఖా ! అదేమి అచ్చట జనులు గుంపులుకూడి యున్నారు ?

శూర్ప—అదియా? అదియే జానకి మందిరము. ఆమెతండ్రి జనకరాజేంద్రుడు వసిష్ఠమహర్షితో ఆమెను చూడబోవుచున్నవాడు. జనులందరు గుంపుగూడి చూచుచున్నారు. మనమును పోవుదము రమ్ము.

(నిష్క్రమము)

---

# లవ-కుశ నాటకము.

## ద్వితీయాంకము.

ప్రథమరంగము:—ఉద్యానవనము.

[ప్రవేశము:—సీతారాములు పాడుచు]

(అనుబంధము 7)

శ్రీరామ—ప్రేయసీ! చూచితే యీ యశోకవృక్ష మెట్లుప్పొంగి యు న్నదో? దీనింగాంచిన జనులుసైత మశోకు లగుచున్నారు గాని విరహజనంబులు గాంచిన సశోకులగుట యేమియచ్చెరువు? నీవు నాడు లంకలో యశోకవనముననున్నవు డశోకవగుచుంటివో లేక సశోకవగుమంటివో?

సీత—నాథా! ఇదియా నన్ను నొవ్వనాడుటకు సమయము?

శ్రీరామ—కాదు, మనోహారిణీ! ఉల్లసమాడుటగాని వేరుకాదు.

సీత—అటులనా? రామా! నా మానసము నీయందు చేరియుండుట చేత శోకము నొందకయుంటిని; నాశరీరము లంకలో చిక్కినందున శోకము నొందితిని. ఇందేమి విశేషమున్నది?

శ్రీరామ—జానకీ! అందుచూచితివా; ఆరాయంచ లెట్లు నడయాడుచు విహరించుచున్నవో.

సీత—అవును. ఆరాజహంసము తన హంసాంగన నెంత వేడుచున్నదో చూడుము. అయినను రాజహంసి తనమగని నించుకయైన సరకు సేయదయ్యె.

శ్రీరామ—జీవితేశ్వరీ! ఇది స్త్రీజనమునకు నైసర్గికగుణమే. కోపము వచ్చినప్పుడు కామినులు కాముకుల పరిపరి తిరస్కరింతురు. మొన్న నీవు చూడుము కిష్కింధయందు నేనెంత వేడినను—

సీత—చాలును లెమ్ము. నాథా! అదియుండనిమ్ము; ఆపుష్పగుచ్ఛమున కూర్చునియున్న యారాచిలుకను కనుము. నీవిచ్చట కొంతసేపు నిలిచితివా తనశరీరచ్ఛాయ యెక్కువగునో నీశరీరకాంతి యెక్కువనో పరీక్షింతువని నీచెంతకే యేతెంచును.

శ్రీరామ—రమణీ! ఎన్నివిన్నాణముల నేర్చినను తుదకు పొరబడితివి. ఎంతబుద్ధిశాలియైనను తుదకు పొరపడుట లోక సహజమేకదా! ఆ చిలుక నావద్దకురాదు, నీయధరోష్ఠమును బింబఫలముగా నెంచి నీకెమ్మోవి సుధ లాన వచ్చును.

సీత—నీసరసము లింక చాలును. నేను మా మాండవీ శృతకీర్తులవద్ద కేగెదను. (అని పోబోవ—)

శ్రీరామ—అలికులవేణీ! ఇంతమాత్రమునకే కోపమా? ఇంక నట్లు మాటలాడను లెమ్ము.

సీత—నాథా! ఆపుష్పగుచ్ఛముతో నాతరువు లెట్లు రాజిల్లుచున్నవో చూడుము?

శ్రీరామ—రెండుపుష్పగుచ్ఛములతో నాప్రక్కనుండు మఱియొక్క మల్లెతీవె యెట్లు రాజిల్లుచున్నదో చూడుము?

సీత—ధూర్తశేఖరా! పొమ్మాపల; నీవిట్లాడిన నేనింటికింబోయెదను. (అని కమలముతో కొట్టును)

శ్రీరామ—కలికీ! ఇందు నా కలక యేమున్నది. ఈవాక్యము నేను చెప్పినదికాదు. నీయెదట నున్న రాజచిలుకయే చెప్పుచున్నది. ఇందు నా తప్పేమున్నది?

సీత—నాథా! చిలుకలేమిచెప్పును? ఒక్కరు చెప్పినట్లు తామును చెప్పును వాటికి స్వబుద్ధి యెక్కడిది?

శ్రీరామ—అట్లయిన నిపుడు చెలువారు కలస్వనముల నలరారు కోకిలలు నీకంఠధ్వనిని యనుకరించుచున్నవి గదా! అపుడు నీకు స్వబుద్ధిచాలదా? లేక వాటికి స్వబుద్ధి చాలదా?

సీత—రామా ! ఏమి నీనేర్పులు ? అందుకే నల్లనివారిని నమ్మరాదని లోకులందురు.

శ్రీరామ—మాటకుముందు కోపపడెదు స్త్రీజనములనైతము నమ్మకూడదని దానిక్రిందనే వ్రాయఁబడియున్నది. అది యుండనీ. నీవా మల్లెతీగియవద్ద నిలిచినందున నీవు రజోవతివైతివి. ఇఁక నన్ను ముట్టకుము.

గీ. రమణి నవమల్లికా సుమరజముచేత
రమణులను గాంచి వెలుఁగు ధీరజముచేత
ఇదె రజోవతివైతివో యింతి నన్ను
చేరరాకుము రాకుము కీరవాణి.

సీత—ఔరా! ఎంతచక్కఁగ నుగ్గడించితివి. పుష్పవతియగు కొమ్మను చేనఁటియున్న నీవుకూడ రజోవంతుఁడవు కావా ? (అని రాముని చేయిఁ పట్టుకొని)

గీ. పుష్పవంతుల కులమున పొలుపుఁగాంచి
పుష్పవల్లిలతాంగముల పొంతఁజేరి
పుష్పవత్సంఘదోషంబు పుట్టకున్న
పేృమ దోషంబెటుంగునే రామచంద్ర.

శ్రీరామ—తరుణీ ! అదే సూర్యుఁడపర దిశాంగనా సరసకేగుచున్నాఁడు. కావుననే పద్మిని ఇనకరస్పర్శమునలేనికతమున వశివాడియున్నది.

సీత—రామచంద్రా ! అందుకే మధుకర పండితు లిదివఱకు నెంతెంతయో తమ ఝంకారములచేత నితర కాముకులకు ధైర్యము చెప్పుచుండిరి. ఇప్పుడు పద్మినీవశంగతులై మైమఱచిరికదా ?

శ్రీరామ—అళినీలాలకా ! ఇదేమబ్బురము ? సెప్పువారికి చేయుటనున్న, లోకమున 'చదివినవానికంటె చాకలివాఁడు మేలు' అను

సామెతను వినలేదా ? ఈచంద్రకాంత శిలాతలమున నింత విశ్రమింతము రమ్మి మనవారు వచ్చువరకు. (ఇరువురు కూర్చొనెదరు)

సీత—నాథా ! మొన్న నీవు గంగాతీరమునందలి వనములనున్న మునులను విచారింపవలయునని యంటివే? ఎపుడుపోయెదవు ?

శ్రీరామ—ఔను. ఇఁక నాలుగైదు దినములలో పోవఁదలఁచియున్నాను. అది యిపుడేల?

సీత—ఏమియులేదు. నేనను నీవెంటవచ్చి యాభాగీరథిని దర్శించి యందున్న తపోధనుల సేవించి రావలెనని నీ యానతి వేఁడవలయుననియుంటిని.

శ్రీరామ—సీతా! ఇదియా దానికి సమయము? నీవు నాలుగు మాసముల గర్భవతివై యున్నదానవుగదా ? అందును నేను కొంతవడి ఘోరమృగముల వేటాడవలయునని యున్నవాఁడ. రమణీ! కుసుమ దండలిఁచుక వ్రేక్కఁజేరిన కరకరిఁ జెందు నీలేమే ననవర తారణ్యతరు ప్రదేశాశ్రమంబుల విశ్రమింపగలదే? లలనా! ఏల యీయభిలాషము నీమది నంకురించె ? వలదు మగువా ! యీ భయంకరాభిలాషము./

సీ. కంటక పాషాణ కలితభూములుగాని
భామ! లీలాసౌధ పఙ్క్తిగాదు
వ్యాఘ్రభల్లూకాది భయద రావముగాని
రమణి! వీణా వేణు రవముగాదు
అల కందమూలాది కాహారములుగాని
సతి! భక్ష్య భోజ్యాది సమితిగాదు
•దుర్లంఘ్య పర్వత దుర్గంబులగు గాని
రమణి! దాటగ పుష్ప రజముగాదు

గీ. తనర మృగవార పరివార జనముగాని
వనిత ! నెయ్యంపుచేటికా జనముగాదు

బాల! దుర్గమకాంతార మేగఁ గోర
నెవరికి సుఖంబు కలుగునే యిందువదన ?

(అనుబంధము 8)

సీత—మనోనాయకా ! అదియేమి దైవాయత్తమో కాని మొన్న మనము గౌతమాశ్రమమునకు వచ్చినపు డామునిభార్యలఁ జూచి నప్పటినుండి కొంతకాలము వారితోఁకూడి ముని ముత్తైదువులతోఁడి వింతయగు నానంద మనుభవింపవలయునని మనమున కోరిక వొడముచున్నది. కావున దీనిని మీరు వద్దనరాదు, ఏమి వింతయనరాదు. ఇది వంత యనరాదు. పోరామి యనరాదు. కలుగు నారామి యనరాదు. ఇది నాకుఁ గలిగి దాదాపుగ నయిదు మాసములై యున్నను అసమసంభూతమగు నీకోర్కె మీతో విన్నవింప మనమున కేమి వెగటు తోఁచునోయని యిన్నినా ళ్ళూరకుంటిని. పైపై వచ్చుచున్న మనోరథముల నణచుకొంటిని. ఇపుడు విధిలేక తమతో విన్నవింపవలసివచ్చెను. అయత్న దైవయత్నమున చిత్తమున కలిగిన నా చిరు కోరికను దీర్ప మీరు సమర్థులని వేఁడు దానను.

(అనుబంధము 9)

శ్రీరామ—(కొంచెమాలోచించి) జనకనందనీ! ఇదేమిట్లు వెకిలివైతివి? మొన్నగదా పదునాల్గువత్సరము లరణ్యవాస మొనర్చి, వేసరి, విసుగుఁజెంది, కన్న కడగండ్లకు లోనై, దైవవశమున పురిఁజేరగం టిమి ? ఇంకను వనవాసాయాస క్లేశము తీరి తీరకయుండునపుడే నీకేల యీకోరరాని కోరికె మదిగలిగెను ? అంతను గర్భవతివై యిట్టి తలవరాని తలంపులఁ దలఁపనౌనే ?

సీ. మొన్నగదా మనమున్న కానలబాసి
పురిఁజేరగంటి మో సరసవాణి
నిన్నగదా మన మెన్నో కష్టములొంది
నిద్రింపగంటి మో నీరజాక్షి

నేఁడుగదా ముని నెలతల వీడ్కొని
యిలుచేరఁగంటి వోజలజపాణి
యిపుడెగదా మన మిల కందమూలముల్
విడనాడనయ్యె నోవిమలగాత్రి
గీ. ఇందుముఖి నీకు నీకోర్కె యేల కలిగె
యేలమి నేకీడు మనకింక కలుగఁగలదొ
వలవ దీకోర్కె వలదిట్టి వాంఛితంబు
వలవ దీబుద్ధి జానకీ వలదు వలదు.
(యోచించి) కానిమ్ము. దైవయత్న మెట్లుండునో తెలియదు. నేను ప్రకృతము భాగీరథీ వనప్రయాణముఁ జాలించెదను. సమయము చూచి నిన్ను మాత్రముఁ బంపెద నట లెమ్ము కొంచెము కాలవిళంబమునకు మాత్రము సహింపుము. పోవుదమురమ్ము.
(నిష్క్రమింతురు)

---

## ద్వితీయాంకము—ద్వితీయరంగము.

### అయోధ్యాపురీ రాజనగరి యెదుట పగడసాల.'

[శ్రీరాముఁడు కూర్చుండియుండును.]

శ్రీరామ—రాజ్యపరిపాలనమున నుండుకష్ట మిట్టిదని చెప్ప నలవికాదు. నిద్రాహారములు మాని, రాత్రింబవలు పాపచిత్తులను శిక్షించుచు, ధర్మముల నరయుచు, ధర్మ పరిపాలనాదీక్ష వహింపకుండినవానికి రౌరవాది నరకములేకదా శరణము? ప్రజలు చేయు పాపకార్యములఫలము రాజగువాఁడు కదా యనుభవింపవలయు ?

సీ. వర్ణాశ్రమాచార బహువిధధర్మంబుల
తిరముగాపాలింప నరయఁడేని
సాధ్వీలలామల సాధు పాతివ్రత్య
మెందును కాపాడ నెంచడేని

లోకనాశన పాపభీకర దుష్టుల
దండింపనాత్మను దలఁవ డేని
ఇష్టాదిక్రియలలో క్లేష్టముల్ సమకూర్చు
శిష్టుల రక్షింప జెలఁగ డేని
గీ. ధర్మదేవత ధరనిల్ప దలఁపఁడేని
పూని జనకష్టముల దాను కానఁడేని
వాఁడు ప్రభుడౌనె నరయంగ పాతకుండు
అవని నరకంబు వానికి నక్షయంబు.

(ప్రవేశము—లక్ష్మణుఁడు.)

లక్ష్మ—అన్నా ! అభివాదములు.
శ్రీరామ—లక్ష్మణా ! రమ్ము అయోధ్యాపట్టణమునందలి వృత్తాంత మేమి? గూఢ వేషమున నేమైన వృత్తాంతములు దెలిసినవా ?
లక్ష్మ—రామచంద్రా ! నీదొరతనమునందు ప్రజలకుఁ గష్టములు కలుగ నేర్చునే ? నీవు భూమినిపాలించుటయన్న నా విష్ణుమూర్తి పరిపాలించినట్లేకదా ? పూర్ణిమా చంద్రునిఁ గాంచి జను లెట్లు సంతసింతురో నీదొరతనమును గాంచి ప్రజలట్లు సంతసించుచున్నారు. కాని తూర్పు వీధియందుండు కొందఱు భూ వ్యవసాయకు లధిక ఋణమును జేసి యనేక ధర్మకార్యముల నాచరించి తుద కాఋణ మెచ్చి వారి బాధకులోనై తమయెద్దులను సేవ్యపు సామానులను విక్రయించి కష్టములకు లోనై యున్నారు. అది తమ దివ్యచిత్తము నకు రావలయును.
శ్రీరామ—అట్లనా ? రేపు నీవు నాయాజ్ఞనొంది వారికిఁ గావలసినంత ద్రవ్యము భాండాగారమునుండి యిప్పింపుము. సంవత్సరమున కింతింతగా వారికేమియు బాధకలుగకుండ నా ధనమును రాబట్టు కొనున ట్లధికారులకు నేమనముఁ బంపుము.

(ప్రవేశము—భరతుడు.)

భరత—అగ్రజా ! నమస్కరించెదను.

శ్రీరామ—భరతా ! వృత్తాంతమేమి ? మొన్న నేవచించినట్లు మన దేశమున రైతులకుఁ గావలసిన యనుకూలములఁ గల్పించితివా ? శిల్ప విద్యావంతుల కనువైన యుద్యోగముల నిచ్చి కొన్ని పాఠశాలలను స్థాపించి, వాని మూలమున శిల్పవిద్యను, అనేక వస్తువులను చేయు నైపుణ్యమును, యంత్రముల మూలమున వస్త్రములు నేయుటను, భూమినుండి సంస్కరించి గ్రహించిన మంటినుండి రచించెడి వస్తువులయొక్క ప్రదర్శనమును, మన రాజ్యమందలి సమస్త విద్యార్థులకు లభించునట్లుఁ జేసియున్నావా ? సమస్త వర్ణముల వారును విద్యాభ్యాసము చేయునట్లు నిర్బంధ శాసనమును వెల్లడి పఱచియున్నావా ? మొన్న మన యగస్త్య మహామునీంద్రుఁడు నవీనముగ పృథివీ, జల, వాయు, తేజ ఆకాశము లనెడి పంచభూతములనుండి కొన్ని యంత్రసాధనములను, దివ్యజ్ఞాన యంత్రములను, కావలసినప్పుడు వర్షము కలిగించు భారద్వాజయంత్రమును, ఖేచరమునందైన సంచరింపగల వాయు యంత్రమును బోధించు నొక భౌతిక శాస్త్రమును రచించి పంపియుండెఁగదా ? ఆశాస్త్రమును మన పాఠశాలయందు విద్యార్థులకు నేర్పన ట్లాజ్ఞ చేసియున్నావా? సన్యాసులును బ్రహ్మచారులును తప్ప మఱియెవ్వరును బిచ్చమెత్తకుండ వారికిఁ దగిన పనులనిచ్చి జీతము లభించునట్లు చేసియున్నావా ?

సీ. ప్రభుభక్తి నిండార ప్రజలు భూపాలుని
ఘనదైవమునుబోలె గాంతురెపుడు
శిల్పశాలలు మేలి శిల్పవిద్యలు పర్వ
పాఠశాలలు నెందు ప్రబలునెపుడు
ఆబాలగోపాల మనల విద్యాభ్యాస
మొనరించి ప్రజ జాల తనరు నెపుడు
వాణిజ్యకృషి తంతువాయన విద్యలు
ఘన యంత్రములచేత కలుగు నెపుడు

గీ. ఆత్మదేశప్రభక్తి యింపారు నెపుడు
భక్తిప్రోత్సాహములు బుద్ధివరగు నెపుడు
అపుడు దేశంబు నభివృద్ధి నందుగాదె
అపుడు సర్వులు సుఖయింపనోనుగాదె.

భరత—శ్రీరామా! అన్నియు తమ యానతిచొప్పున చేసియున్నాను. అగస్త్య మహాసిందుని యంత్రవిద్యయును, పూర్వమునుండియుండిన భూయానము, జలయానము, వాయు యానము మొదలగు యంత్రవిద్యలను, సర్వులు నేర్చుకొను నట్లాజ్ఞనిచ్చియున్నాను. మఱియు తమ నేమనము ప్రకారము ప్రతికుటుంబమున నొక్కొక్కండు శస్త్రవిద్యయు, తురగారోహవిద్యయు దేహపరిశ్రమవిద్యయు నభ్యసించి యుద్ధపాండిత్యము సంపాదించునటుల కట్టడిం బంపియున్నాను.

శ్రీరామ—మిక్కిలి సమంజసము. ఇది దేశాభివృద్ధికిం గారణము.

[ప్రవేశము—ఒక గూఢచారి]

గూఢ—విజయోస్తు శ్రీరామభద్రునకు.

శ్రీరామ—వృత్తాంతమేమి ?

గూఢ—దేవా! మనపురమున బ్రాహ్మణుండొకండు యజ్ఞము చేయుటకై యొకవైశ్యుని కోటిరూప్యముల ధనము వేండెనంట ఆతండు దానమిచ్చెనట. తర్వాత నాబ్రాహ్మణుం డాధనము తనకు వల దనియు తనభూమినుండి తనకుం గావలసిన ధనము లభించినదనియుం జెప్పెనంట. అందులకా యజమాని నాకుం దత్తాపహార దోషము లభించెనని బ్రాహ్మణునితో వాదులాడుచుండ వారిఱువురినిం దోడ్తెచ్చియున్నాను.

లక్ష్మణు—ఇవుడేల వారినిం దోడ్తెచ్చితివి? వారిని రేపు రాజాస్థానమున విమర్శనకాలమున బిలుచుకొనిరమ్ము.

శ్రీరామ—లక్ష్మణా అటుల కాదు. రాజునకు యెక్కడకూర్చున్న నదియే రాజాస్థానము. కంచుకీ! వారిని బిలుచుకొనిరమ్ము.

గూఢ—భాగ్యము. (నిష్క్రమి)

[ప్రవేశము: బ్రాహ్మణుఁడు, వైశ్యుడు]

బ్రాహ్మ, - వైశ్య—(నమస్కరింతురు)

శ్రీరామ—బ్రాహ్మణా! నీవర్తకునినుండి దానమడిగిన ధనము నవశ్యము తీసికొనవలయు. ఎన్నఁడితఁడా ధనమును దానమిచ్చెనో యప్పుడు నీయదియే యది.

బ్రాహ్మ—దేవా! దానము తీసికొని వృథా వీని పాపము నేను తీసికొనవలయునే ?

శ్రీరామ—బదులు చెప్పకుము. ఇది రామాజ్ఞ.

బ్రాహ్మ—చిత్తము. (నిష్క్రి)

శ్రీరామ—లక్ష్మణా ! ఇపుడెంత ప్రొద్దయినది ? అదే తూర్పుదిశ నగస్త్యుఁ డుదయించుచున్నవాఁడు. ఇంక కొన్ని ఘడియలలోనే సూర్యుఁ డుదయింపఁగలఁడు. ఇఁక రాజ్యపాలన కష్టముల మాని కొంతకాలము విశ్రమింపఁ జనుఁడు.

లక్ష్మణ, భరత—భాగ్యము. (నిష్క్రి)

శ్రీరామ—ఏల యింకను నాల్గవయామ చారుఁడు రాలేదు ?

(ప్రవేశము: భద్రుడు)

భద్రుఁడు—శ్రీరామప్రభువునకు జయమగుఁగాక!

శ్రీరామ—భద్రా! రమ్ము. జారచోరబాధలేకుండ పౌరులు సుఖవంతులుగ నున్నారా! ప్రజలు నన్నెమైన దూషించుచుండిరా ? లేక సత్కార్యములను మిక్కిలి నిర్బంధముతో యత్నములేక చేయుచుండిరా ? రచ్చటరుగులయందును, కుటుంబకలహములయందును నావిషయమై యాడికొనుచుండిరా ? అంతయు సవిస్తరముగాఁ దెల్పుము.

భద్రుఁడు—శ్రీరామచంద్రా! నెలకు మూఁడువర్షములు, సంవత్సరమునకు మూఁడుపంటలుగలిగి, రాజ్యము క్షేమరాజ్యమైయుండ సర్వులు "శ్రీరామ, శ్రీరామ" యనుచు నిన్నే దైవముగభావించుచున్నవారు. వక్రమార్గమందు నడచుటయున్న సర్పములయందు కాని నీప్ర

జలయందు లేదు, వ్యభిచారమన్న న్యాయశాస్త్రమునందుగాక నీ దేశమునం దించుకయు చూపట్టదు. అసత్యమన్ననో ఆపదలయందు మాత్రము దాగియున్నదిగాని నీ రాజ్యమున కానరాదు. దేవా! శ్రీరామమూర్తివై, సర్వోలపాలి దైవమవై భూమియందు వెలసిన శ్రీహరివి కావా నీవు? నీరాజ్యమునందు జనుల కసంతృప్తి గలుగ నేర్చునే? ఇంక రచ్చటరుగులయందలి వృత్తాంతముల నీచులగు వారి మాటల నెవరు పాటింతురు? త్రాగుబోతు లుచ్చావచముగ నేమేమియో మాటాడుదురు. వారి యభిప్రాయము మనమేల గ్రహింపవలయును? అందఱును నానందాబ్ధి నోలలాడుచున్నారు.

శ్రీరామ—భద్రా! నీమాటలు కర్ణరసాయనములుగ నున్నను నించుక విషము చేకూడియున్న వనుటకు నందియములేదు. హీనుల మాటలను పాటింపగూడదంటివిగదా? అది నీ వెంతయు తెలియక పలికితివి. ఉత్తములగువారు సుగుణముల మాత్రము గ్రహించి పరులను భూషింతురు. ఇంక నధములన్ననో యెన్నిగుణములున్నను మాని దోషములను మాత్రము లెక్కింతురు. అట్టిచో తన దోషముల నెఱుఁగుటకు నపేక్షించువాఁడు తొలుతి నుత్తముల మాటల కన్న నధములమాటలనే పాటింపవలయు. కావున మొదట చెప్పుము; ఏహీను లేనీచు లేదోషములను నాయం దారోపించిరి.

భద్రుఁడు—దేవా! పరుల సద్గుణములు నీచులకు దుర్గుణములుగా తోచును. మద్యపానులు మధుపానమే స్వర్గద్వారమని భావింతురు అట్టివారి యాశయములు తమ గుణదోషముల నెరుఁగుటకుఁ గారణములగునే? అశ్రావ్యములై, అతిపాపకరములై, అన్యాయమార్గదర్శకములై యున్న నీచాలాపముల వినుటసైతము మహాపరాధమనికదా పెద్దలు చెప్పుదురు?

శ్రీరామ—నీవు కాలవిళంబమున నామానసమును మిక్కిలి సంతాపయుక్తముగా చేయుచున్నవాఁడవు. నీవు వచించినది రాజులకెప్పటి

కిని నన్వయింపదు. నీచులగుదురుగాక; వారిమాటల నే నవశ్యము వినవలయు. జాగుచేయక వచియింపుము.

భద్రుఁడు—దేవా! చాఁకలివాఁడొకఁడు కాముకుఁడై తప్పద్రావి, మైమఱచి కోపావేశమున నేమియో పలికినమాటల నే వినినదే మొదటితప్పు. అట్లుండ తమయెదుట వాటిని వచించి తమ దివ్యచిత్తమున కొంత కొంత గలిగించి నన్నపరాధిగాఁ జేసికొమ్మని నాకు సెలవిచ్చిన నేనేమి వచించువాఁడను? ఇంతకును నాకొకటి తెలిసిన మఱియొకటి తెలియదీయూఱి వృత్తాంతము. నేనీయుద్యోగమునఁ జేరి నాలుగుమాసములేకదా యయినవి?

శ్రీరామ—భద్రా! మాటల వలన జాగుచేయుచున్నవాఁడవు. కాని వృత్తాంతము వచింపవైతివి. ఇఁక ప్రభుకోపమునకు పాత్రుఁడవయ్యెదవు.

భద్రుఁడు—దేవా! క్షమింపుము. ఇదే వచించువాఁడ. ఈయూరికినుత్తరదిశయం దొకచాకఁలికుటుంబము వాసముఁజేయుచున్నది. ఆచాఁకలివాని పేరు దుర్ముఖుఁడందురు. వాఁడు తనభార్యయందు సందేహముఁ గలిగి కొట్లాడి యిల్లువెడలగొట్టెను. ఊరి పిన్న పెద్దలు వానికి ధర్మముపదేశించుటకు వచ్చిరి. వాఁడు వారితో నేమో దబ్బరకూతలు కూసెను.

శ్రీరామ—ఏమి కూసెను?

భద్రుఁడు—(తలవంచుకొనును.)

శ్రీరామ—చెప్పుమట్లలసందేహించెదవు? నీకభయమిచ్చియున్నాను.

భద్రుఁడు—"మీ రెంతచెప్పినను ఆదబ్బర కత్తెను నేను గ్రహింపను." అని వాఁడు వారితో చెప్పెను.

శ్రీరామ—కానిమ్ము. అది వాని యిష్టము. అందేమి తప్పున్నది?

భద్రుఁడు—వానిబంధువులు "ఏమో తెలిసియో తెలియకయో తప్పు చేసినది; దానిని మనసున నుంచకుము" అని బ్రతిమాలుకొనిరి.

శ్రీరామ—అది వారికి ధర్మమే ఎట్లైనను దంపతులను కూర్పవలయు నుకదా ?

భద్రుఁడు—"కట్టివిడిచిన గుడ్డను, నిల్లు విడిచిన స్త్రీని యెన్నటికిని తీసి కొనరా" దని వాఁడు చెప్పెను.

శ్రీరామ—అదియు నిజమే.

భద్రుఁడు—పెద్దమనుష్యులు తుదకు విసికి "శ్రీరామునకుఁ జెప్పి నీకు శిక్ష విధించునట్లు చేసెదము. ఊరక భార్య నేలెదవా లేదా" అని యడిగిరి.

శ్రీరామ—తరువాత ?

భద్రుఁడు—దేవా ! నానోట నెట్లు చెప్పుదును ?

శ్రీరామ—చెప్పెదవా ? నా శిక్షకుఁ జిక్కెదవా ? చెప్పుము.

భద్రుఁడు—దేవా! ఇంక నాయత్నము లేదు. చెప్పెదను. వాడు "రాము డే పెద్దమనిషి ? చెప్పకొంటె చెప్పకొనుడి ; నా కేమి భయమా ? నేను రామునివంటివాఁడనా ? రాముఁడు యిల్లువిడచి పగవాని యింట యేడాది పొరలాడి వచ్చినభార్యను మరల పిలుచుకొని పాలించుచున్నాఁడు. నేనట్లు పిలుచుకొందునా ? పరపురుషునితో మాటలాడిన ఆడుదానినే నమ్మరాదఁట ! ఎవ్వరి యింటిలోనో యిష్టానుసారముగ నుండిన పెండ్లమును నే నెన్నటికిని పిలుకొన" నని పలికి యూరు విడిచి యెచ్చటికో పోయెను.

శ్రీరామ—(తలవంచుకొని) భద్రా ! ఇఁక నీవు పొమ్ము.

భద్రుఁడు—అగ్ని పెట్టితిని. దీని ఫలమును త్వరలో నే యనుభవించెదను.

శ్రీరామ—ఆహా! ఇదియే నామృత్యుద్వారమని తోచుచున్నది. విన్నది నిజ మనవలయునా ! కన్నది లేదనవలయునా, అయ్యో ఘోర లయకాలదవానలమువలె యొడలంతయు కాల్చి యుడికించు నీ సకల జనగర్హితలోకనిందాదురుద్ధరరోగము నెట్లు భరియించుకొని జీవింతును ? మొన్నగదా నాపడిన కడగండ్ల ప్రవాహము మొద

లంట నెండి, నను( బాసిపోవ పరమసంతోష మేలగంటి నని యూరట(జెందితిని ? కట్టా ! అట్టి కట్టడి పురాకృత దుష్కృత పరిపాక సంజనిత భీకర శోకరసపూరంబు నన్నింకను( బాయదయ్యె గదా ? అయ్యో ! పదునాలుగేండ్లరణ్యవాస సంభూతక్లేశంబును లెక్కింపనైతిని. దుర్వహ సీతాపహరణరావణ దారుణకృత్య మెద నించుకైనఁ గొననైతిని. దుస్సహ నిజభార్యావియోగదుఃఖ పారావారంబు నాకింతయేని సరకుఁగొనక ద్రెళ్ళిఁడి సీదఁగంటిని. ప్రతివతు రాక్షసవీరనిశితబాణక్షతక్షోణిత పూరమహాయాసంబునైన యీఁగ వ్రాలిన కైవడి యింతయైన మానసంబునకుఁ దోపనీనైతిని. ప్రాణాధిక సోదర లక్ష్మణ మహామూర్ఛారూపమరణంబును కన్నులారఁ జూచియు దుర్వారపరాక్రమ క్షత్రియధర్మ సంస్మరణంబునభూరితర మనోవేదనా సంతాపంబు నంతటితో నణచివైచితిని. కానియిపుడు నా శ్రవణపథంబున దూరి మానస కమల పుటభేదనం బొనర్చి, సకలావయవంబుల సత్వసారంబంతయు మొదలంట పీల్చి, మదీయ ప్రాణానిలంబుల నొక్కుమ్మడి పోకార్చి నానిలువంతయు పెనము పైన నిడినభాతిదుస్తరసంతాప తైలపూరమునముంచు నీసీచపాతక లోకాపవాద హాలాహలంబును నెట్లు సహింతును ?

సీ. అగ్నికీలలఁబోలె నంగంబు నుడికించు
    వినరాని యపనింద వింటి నేఁడు
మహిరాజవరులలో మానంబు విడనాడి
    తలవంచి మెలఁగంగవలసె నేఁడు
యశము సంతసమును వెసఁబాయ సతతంబు
    పరదూషణలఁ బొందవలసెనేఁడు
పరిశుద్ధమగు భానువంశంబు నావల్ల
    పరమ హేయత నందవలసె నేఁడు

గీ. పరగ ధర్మంబు నడుగంటవలసె నేడు
చెలగి జీవచ్ఛవంబు కావలసె నేడు
పరులు నను(జూచి తొలగంగ వలసె నేడు
కనగ రాముండు రాముండు కాడు నేడు.

ఆహా! ఇంకేల వెనుదీయవలయు? నాకెంతయు మహాపత్సమయమున నుపకారము చేయ(జాలి నాచే నలరారు నీకరవాలమున చచ్చి చావక పరితపించుచున్న నా ప్రాణము నట్టెతీసి బారవైచి మృతు(డనై పరలోకమునందైన నిశ్చింతగ నెదపైన చెయినిడుకొని నిదురించెద(గాక. అకటా! ఈదుష్కర్మనకు; నీయాత్మ హింసా పాపునకు పరలోకసుఖ మొకటి కలుగ(జాలునే! ఇందిప్పు(డనుభవించు మహాదుఃఖ నరక మొకటి చాలక పరలోకమునందును భీకర రౌరవాది మహానరకము ననుభవింతునా? ఔరా! ఇట్టి తలవంపులకు మూలకందమై లోకాపవాదమునకు బుట్టినిల్లై, నా మనస్సంతాపశోకరసంబు పాలిచెలిమియైయున్న యా నిర్భాగ్యురాలగు జానకిని వధించి జన నిందల(బాయుదునా? అకటా! పరమ సాధ్వీమణియే! నాతోడి కష్టసుఖముల నద్వైతరీతి ననుభవించిన ధీర చరిత్రయే! రావణునంతటివాని నించుకయైన సరకు(గొనక నగ్నిజ్వాల(బోలె చేరరాకుండ(జేసిన పరమపతివ్రతామణియే! తన సౌశీల్యమును(జాటునట్టు పావకాగ్ని హోత్రమున దుమికినను వశివాళ్లువాడక, చెమర్పక వచ్చిన మహామహిమోపేతయే! అట్టి నాజీవధనమును, నాపంచప్రాణ నిధానమును, నా సకల సద్గుణ పూతను, సీతను నాచేతులార వధింప నెట్లు పాల్పడుదు? అయ్యో! అటుగాకున్న క్షణక్షణమును, నక్షరాక్షరమును, శూలమువలె నన్ను వేధించు లోకాపనిందల(బడి, సరివారిలో(దలవంచి, యుత్తమక్షాత్రధర్మముపీడి తరితపించి పరితపించి తుదకు దుర్మరణముగదా పొందవలయు? నా దుర్మరణ మటుండ, ఆ జన్మ

పావనమై, యమిత యశోవిరాజితమై, ప్రపంచ కామినీ తిలకాయమానమగు సూర్యవంశమున కపకీర్తి నాయట్టి హతభాగ్యుఁడొకఁడు జనించినందున కలుగుఁగదా? భానువంశపు కీర్తికి సమ్మతింతునా? ఆత్మహత్య కియ్యకొందునా? పరమపతివ్రతా నిజభార్యారూప స్త్రీవధకు సమ్మతింతునా? కాలకూట విషోపమాన జనాపనిందల నంగీకరింతునా? లేక తలమున్కలుగా చనువెంచు నీ లోకదూషణ మహాగ్ని గుండమునఁ గలకాలము మునిగి దుఃఖింతునా? కట్టా! ఈ పాపపుదిన మేల నేడు నాకు గలిగె? ఈ రేయి నేనేల నయోధ్యాపుర వృత్తాంతమునుఁ దెలసికొన యత్నించితిని? ఈపయోముఖవిషకుంభమగు భద్రుఁడేల నా వద్ద కరుదెంచె? వానినేల నగరవృత్తాంతము నడిగితిని? అయ్యో! వాఁడు వలదని యెంత వేఁడినను పెడచెవినిఁబెట్టి వచించియే తీరవలయునని నేనేల నిక్కచ్చిఁజేసితి? అయ్యో! పురాకృత పాపశక్తివలన కలిగిన దుఃఖములకు పిదప వగచి ప్రయోజనముండునే? కాకున్న జానకిని నెక్కడికైనఁ దుదకు మిథిలాపురికైనఁ బంపుదునా? అయ్యో! ఒక్కనిమిషమైన నావామభాగము నెడబాయని మా జానకి దానికి సమ్మతించునే? మొన్న తనతండ్రి జనక రాజేంద్రుఁ డెంత వేఁడినను పతిని విడనాడి నేనెన్నటికిని రాఁజాలనని వచింపలేదా? అదియుఁగాక నీయుదంతము బంధువులకుఁ దెలసిన కులము వాశియే చెడును గదా? ఇట్లుచేయుదునా? ఆ జానకి నేదోయొక మహారణ్యమున విడిచిరమ్మని పంపుదునా? ఆ సుకుమారి నిర్జనారణ్య ప్రదేశమున సంచరించి త్రోవ దప్పి పుట్టినింటైనఁ జేరఁగలదు, (ఇంచుక యోచించి) ఆహా! మఱచితి. తొలుతనే భాగీరథీ తీరారణ్యముల విహరింపవలయునని మా సీత నన్ను వేఁడియుండెగదా? దానినే యొసంగెద. అడవులకే పంపెదగాక. అక్కటకటా! ఓ రామా! నీ కెట్టి పాపబుద్ధి జనించె? పూర్ణ గర్భవతియై, సంపూర్ణ

ధర్మభార్యయైన యా సీతను నట్టడవుల దోల సాహసించె దవా? దుష్కర్మా! ఈ క్రూర పాతకకార్యమును గాంచి జనులం లందరు నాబాలగోపాలము నిన్ను దూషించరోయి? అకటా! ఎట్టు లైనను నాకిదియే ప్రళయకాలమని భావించెద. ఇఁక నే మనఁ జాల. మద్వియోగశోకమున మాతండ్రి దశరథుఁడు మహత్తర తాపమునఁ జచ్చినట్లు నేనును భార్యావియోగక్రూరకార్యసంతాప హుతాశకీలలఁబడి చావవలయునని విధి నానొసట వ్రాసియున్నా డుకాబోలు? ఇటుల మనినంతకాల మంతర్దాహమున, లోకాప వాదమున శరీరము చిక్కి క్షణక్షణమున కింతింతగా చచ్చుటకన్న భూరితర సీతా వియోగదుఃఖసాగరమున మునిగి యొక్కటె తూరి మృతిఁజెందెదఁగాక! అయ్యో! నిండు గర్భవతియగు నిజదారకు వలయు వాంఛితముల నిచ్చు పుణ్యాత్ములుందురుగాని నావలె ఘోర నిర్జన పరేతభూములకు పారదోలు పాపాత్ము లుందురే? నా ప్రేమంపు జీవధనము నేఁడు ననుబాసె. నాకలుముల వంట, నా కామితములదొంతి, నేడు నన్ను తొలఁగె. నాభాగ్యలక్ష్మి నేఁడు నన్ను వీఁడె. నాప్రాణంపుచిలుక నేఁడు నాసరస వదలె. నా యానందసేటిక, నా వామభాగభూషణము నేఁడు నాదండ వీఁడె. నిరంతరభూషణాంచితకరుణారసమా! నేఁడు నాయం దుండక యెటు చనితివి? అనవరత సమ్మాన విరాజమానప్రాణశరీరబంధన సంజీవనౌషధ ప్రేమరసమా! నేఁడేల నన్ను దూరీకరించితివి? ఆర్తపరిత్రాణ రసానూచిత సర్వభూతపరిపాలక ధర్మాధిదేవతా! నేఁడు నా దృష్టిపథమేలతొలఁగితి? కనికరమా! దాక్షిణ్యమా! అభిమానమా! నను జేరరారే! ధర్మమార్గవిరామా! పాపనిచయ ధామా! ఘోరకార్యసంభీమా! ఓపాపిరామా! నీవేల బ్రతికితివి? సీతా! సీతా! సీతా!

(మూర్ఛపోవును.)

---

## ద్వితీయాంకము—తృతీయరంగము.
## రాజనగరు.

శ్రీరాముఁడు మంచముపైఁ బరుండియుండును, సేవకులు గుసగుసలాడుచు భయము నొందియుందురు.

[ప్రవేశము—లక్ష్మణ భరత శత్రుఘ్నులు దూరమున]

భరత—లక్ష్మణా! ఈయకాలమున రాముఁడేల మనల బిలిపించియుండును? మన మిప్పుడేకదా యతనితో నాజ్ఞ గైకొని పోతిమి? అంతలో నేమివిశేషము నడిచియుండును?

లక్ష్మణ—భరతా! అదియేమోకాని అన్న పిలిపించినప్పటినుండియు నాహృదయమున చెయివెట్టి కలచినరీతి సంతాపమగుచున్నది. అల్లదే! చూచితే శ్రీరామచంద్రుని మోము మధ్యందినార్కబింబము చెంత నున్న చంద్రబింబమువలె భయంకరముగ నున్నదిగాని పూర్ణిమాచంద్రునిరీతి నాశ్రితుల కాహ్లాదముఁ గలిగింపకున్నది. అదియుగాక సేవకజనంబులు భయభ్రాంతులై కదల మెదల నేరక యున్నారు. రాజనగరంబంతయు నిద్రపోయినరీతి నిశ్శబ్దముగ నున్నది. ఇంట నింతైన సంతసము చూపట్టదు.

శత్రు—అగ్రజా! చూచితివే. మనోహర సరోజకాంతిని మావఁజాలి, నిజ సంచలనమాత్రమున ముల్లోకముల నేలఁజాలు నిడుదకనుదారల నుండి యశ్రుజలంబులు దరిద్రుని సుగుణంబులరీతి దిగజారుచున్నవి. రావణాది ప్రతివంథుల మార్కొనునప్పుఁడైన, ఇంద్రజిత్తు నాగ పాశంబులకుఁ జిక్కినప్పుఁడైన గలుగని చింతాభరం బీమహానీయున కీనాఁడేల గలిగియుండును?

లక్ష్మ—ఆహా! ఇదియేమో జగత్ప్రళయము కాఁగలదని తోచు చున్నది. పరమ శాంతస్వరూపమగు శ్రీరామమూర్తి చూపరులకుఁ దేరిచూడరాకట్టి భయంకరమూర్తియై, అంతరమందు శోకమూర్తియై యున్నవాఁడుకదా?

భర—సమక్షము రాయబారమేల ? పోయి అన్నకు నమస్కరించి తెలిసికొందము రండు. వచ్చినయాపదలు వలదన్నఁ బోవునే ?

(అందరును పోయి నమస్కరింతురు. శ్రీరాముఁడూరకుండును.)

లక్ష్మ—అన్నా ! ఇదేమి విపరీతము ! ఆశ్రిత సంరక్షణ దరహాసనుం దరంబగు నీ సుందర వదనారవిందము వాడియుండు టీరేడులోకముల దురదృష్టమేకదా ! మావలన నేమైన నపరాధము కలిగెనా? ప్రజలకేమైన నాపదసంభవించెనా ? వచియింపుము. నీ దాసుఁడగు నేనుండ నీవింతచింతిల్లనేనే ?

మ. తలపో, తాపమొ, లోపమో, యధిక చింతాభారమో, శోకమో
అలుపో, మా యపరాధమో, ప్రజల పాపాసూయయో, కాలమో
తెలుపఁగ రాదో వినంగ రాదో, యిటులార్తిం జెందె దేమన్న యీ
కలుషంబేమొ వచింపుమన్న మసలఁగ కాదన్న నే మ్రొక్కెదన్.

భర—అగ్రజా ! నీవు చింతిల్లిన లోకము చింతిల్లదే? నీయనుగ్రహము నకై కాచుకొనియున్న మాయం దింత యనాదరణ మొనర్చుట నేడేఁమో యద్భుతముగ నున్నది. మాపై కరుణాకటాక్షములు ప్రసరింపఁ జేయుము.

శత్రు—అన్నా! వీరందరు ప్రజ్ఞావంతులు; మీయానతి ననేక కార్యములఁ జేయుచుండెడివారు. వీరెందైన నపరాధమును జేసియుందురు. నేనేమియు నెఱుఁగనే ? నాయం దేటికోపము ? నేను వచ్చినవెంటనే చెంతకుఁజేర్చి యెంతయోనిండారుప్రేమతో మాటాడించుచుంటివే? నేఁడు నేనొనర్చిన తప్పైనదేమి? (అనిపాదములపైఁబడును.)

శ్రీరామ—శత్రుఘ్నా! లెమ్ము. (లేవనెత్తి) పరమ సుస్వభావులగు మీయం దపరాధమున్నదన్న నాపరమాత్మయందు దోషమున్నదన్నట్లేకదా? తమ్ములారా ! మీయందు నాకుఁ గోపముకలదే ? కూర్చొనుఁడు.

లక్ష్మ—అయిన మమ్ములను సీయకాలమునందు పిలిపించుటకు గారణమేమి? మోము కాంతిం బాసి విన్నవోయి యుండుటకుఁ గారణమేమి ?

శ్రీరామ—సోదరులారా! నాయాజ్ఞ యన మీకెట్టిది ?

భర—శిరసావహింపఁదగినట్టిది.

శ్రీరామ—అయిన దానిని మీరు తప్పరుగదా ?

లక్ష్మ—మాశరీరమునుండి జీవము తప్పిన తప్పునేమో కాని మీ యానతిఁ దప్పువారమా ? రామా! ఇవేటి క్రొత్త మాటలు?

శ్రీరామ—అట్లయిన మీలో నెవ్వరైనను రేపు తొలిజామున నే మీవదినె జానకిని భాగీరథీ తీరారణ్యమందు విడిచి సూర్యుఁడు మధ్యాహ్నగతుఁడగుటకు ముందే పురిఁ జేరవలయును ఇది నా యాజ్ఞ. దరికి రండు. మీలో నెవ్వ రీకార్యముఁ జేయుదురు?

అందఱు—రామా! రామా! రామా! ఏమి? ఏమి యీ విపరీతాజ్ఞ? ఏమికారణము ? ఇట్టి యాజ్ఞ యెందైనఁగలదా?

శ్రీరామ—నాతమ్ములు మీరైనయెడల మారాడక నా శాసనమును నిర్వహింపుఁడు.

భరత—దేవా! కారణమడుగకూడదా ? నిష్కారణముగ మా తల్లిని నడవులఁద్రోసి జగత్ప్రళయము చేయుదువే ?

శ్రీరామ—సోదరా ! భరతా ! నీకు వచింపరాని కారణము నాకున్నదా ? కట్టా! మఱల నావ్యసనము నన్ను ముంచునుగదా యని మసలితి సహోదరులారా !

(అనుబంధము 10)

ఇటురండు. (వారిపై వ్రాలి) మనయూరనున్న నొక చాకలివాఁడుతన భార్యపై సందేహించి దాని నిల్లు వెడలగొట్టగా కొందఱు పెద్దలు భార్యను పరిగ్రహింపుమని వానికిఁ జెప్పిరఁట. అందులకు వాఁడు

నేనేమి రాముఁడనా? వగవానివద్దక్క పదియేండ్లు పడియున్న భార్యను పరిగ్రహించుటకని కర్ణకంటకములను నుడివెనఁట. ఆ యపవాదము నాదేహమును కాల్చుచున్నది. కావున మీవదినెను ఘోరారణ్యమున డించి రమ్మని మీ కానతిచ్చితి. నా మాటకు మాఱాడకుఁడు.

భరత—ఇంత కింతకావలయునా? ఏవ్వఁడో యొకఁడు త్రాగుబోతు బుద్ధి స్వాధీనమున లేక పలికిన దుర్భాషలకై, అయ్యో! సంపూర్ణ గర్భవతిని, పరమపావనాకృతిని, లోకజనయిత్రిని జానకీదేవిని నట్ట డవిని విడువఁదగునే? ఆచాకలివాని మాటలు ప్రమాణములా? బ్రహ్మమహేశాది దేవవర్గముల యెదుట అగ్నిగుండమునుండి పరి శుద్ధయై వెలువడి వచ్చిన యీ పరమసాధ్వీమణి పాతివ్రత్యము ప్రమాణమా? నీవే యోచింపుము. అన్నా! నీకుఁ జెప్ప నేనెం తటివాఁడను?

చ. జనకుని కూర్మిపుత్రి, వరసారస బంధుకులంబు కోడ ల
త్యనఘుత రామచంద్రు సహధర్మిణి, మామక పూజ్యమాత శ్రీ
వనిత పరావతార మభివర్ధిత వేదవనాంతకీర మా
జననిని నిందలాడ నపచారముఁగాదె దలంపరాఘవా?

శ్రీరామ—ఈవిషయమున మాటలాడకుఁడు. ఇది నా నిర్ధారణము. భూమ్యాకాశములు తిరిగినను నిది తిరుగఁజాలదు. ఊరక వచింప కుము. నీవేమి నాయానతి చేసెదవా? లేదా?

లక్ష్మ—స్వామీ! ఇదియేమి లోకనాశన కాలము సమీపించినదో బ్రహ్మప్రళయము కానున్నదో తెలియదు. రామచంద్రా! సీతా మాతనా నీవు సందేహించెదవు? అంత సందేహించిన నామె ప్రస వించువఱకు నొక్క రమ్యసౌధమున నుంచుము. పిదవ పుట్టినింటికిఁ బంపుము. అడవికిఁ ద్రోలవలయున నేఁడి కూర కార్యమేల?

సీ. అగ్నిగుండముఁ జొచ్చి యతిసాధ్వియన నెల్ల
జగముల సత్కీర్తి చాటలేదె
బ్రహ్మాదిసురలు సత్సావని యనుచు నీ
దేవి వేనోళ్ళ నుతింప లేదె
మనతండ్రి దశరథ మనుజేశుఁ డీసీత
కులదీపక యటంచు వలుకలేదె
అలనాఁడు, అనసూయ, యతిశయంబుగ మాతో
యీసాధ్వీచరిత వర్ణింపలేదె
గీ. స్మరణకునురాదొ, తెలియదో, మాంద్యమేమొ
రాముఁడవో, కావో, మాదు దుష్ప్రాప్తియేమొ
నిజము కనుమన్న, యపనింద నిక్కమన్న
మమ్ము, ప్రజలను, కులమును మనుపుమన్న.

శ్రీరామ—లక్ష్మణా! హెచ్చైన చనువిచ్చినందునకా యిట్లు మాట్లాడెదవు ? మీరీకార్యముఁ జేయకున్న నేనే యిందుకు పూనెదను గాక! అయ్యో! గ్రహచారసమయమున నెక్కడితమ్ములు? ఎక్కడి బంధువులు? ఎవనిపాపము వాఁడనుభవింపవలయుఁగాక.

శత్రుఘ్న—అన్నా! నామాట ?
శ్రీరామ—శత్రుఘ్నా! నీవు మాటాడిన నాయాన కలదు.

లక్ష్మణ—అన్నా ! మేము నీయానతిఁ జేయమని యంటిమా ? ఇది ధర్మమా యని యంటిమి ?

శ్రీరామ—అటులైన మెచ్చితిః ఏమి నీకుఁ గావలయును. చెప్పుము ?
లక్ష్మణ—నాకు కరుణయు నభయమునుఁ గావలయును.
శ్రీరామ—కరుణ కలుగదు. రాదు. రాఁ జాలదు.
భరత—ధర్మ విమర్శనమిమ్ము.

శ్రీరామ—ధర్మమిదివరకే విమర్శింపఁబడినది. మఱల నది కాఁజాలదు.

శతృఘ్న—నాకు కాలవిలంబమిమ్ము.

శ్రీరామ—అరగడియ నివ్వను.

లక్ష్మణ—అన్నా ! నీవు నేఁడు రాముఁడవు కావుసుమా ! క్రూరహింసయే? గర్భవతీమారణమే? అగ్నిసాక్షిగ పాలించెదనని నీ వొనర్చిన ప్రతిజ్ఞకు భంగమే ? విమర్శనముఁజేయక, పాతకోపబాధితుఁడవై, తమ్ములమాటల చెవినిడక, నీవు చేయు సకలలోకనిందాకర, పాపకర, పశ్చాత్తాపకర, హింసా కార్యమునకుఁ దోడు మాకును ఘోర దుష్కృత విషజ్వాలల ఘటింపఁ జూచెదవే ? ఎందుబోయె నీధర్మము? ఎందుచనియె నీ జ్ఞానము ? నీవిట్టివాఁడవగుదువని యొక్కనాఁడైన నే నెఱుఁగను. రామా ! ఏల తేన బూసిన కత్తికై వడి మమ్ముల రౌరవాది నరకములో పడద్రోసెదవు? అంత నీవు కన్నుఁ వేగ్గైన నీనిశిత ఖడ్గధారచే మా శిరంబులఁ గైకొమ్ము సంతసమున నిచ్చెదము.

శ్రీరామ—ఔరా ! లక్ష్మణా ! నీవు నాకుఁ దమ్ముఁడవా ? కటిక పగదాయి వగుదువుఁగాక. నన్ను దూరెదవా ? నాకు జ్ఞాన ముపదేశించెదవా ? భార్య లోకనిందనీయురాలయ్యె. తమ్ములు పగతులైరి. ఛీ! మీముఖములఁ జూచిన పాపకరము. నేనే పోయెద. మీకేల కష్టము. మీరు నాకు దమ్ములు కారు. పొండావల.

శా. ఔరా! సోదరుఁడౌదువే? కఠిన నీచాలాప సంతాప కృ
ద్ఘోరాకార విరోధివాదువు నిను న్దూరంగ నేలా ? మహా
క్రూరంబావిధి చాలదయ్యె; యనుజుల్ గూఢంపుశస్త్రిపఖుల్
కారే! వారిని విశ్వసించితిని శిష్టా ర్హ్యుండనై యక్కటా !

లక్ష్మణ—(రాముని కాళ్ళఁబడి) అన్నా ! క్షమింపుము. పసితనమున కన్నుమిన్నెఱుంగక మాతల్లియందుగల ప్రేమచే మహాత్తరక్షోకా

వేళమున నేమియో మాటలాడితిని. నా యపరాధమును మన్నింపుము. ఇదె నీయానతి చేయువాఁడ. ఆనతిమ్ము.

శ్రీరామ—(లేవనెత్తి కన్నీరు విడచుచు) లక్ష్మణా ! నాకీలోకమే పాడై తోచుచున్నది. ఈ సౌధము గిరగిర తిరుగుచున్నట్లున్నది. ఇంద్రియములు నావశము గాకున్నవి పొమ్ము. హా ! జానకీ ! జానకీ ! (మూర్ఛిల్లును.)

(యవనిక పడును.)

---

# లవ-కుశ నాటకము.

## తృతీయాంకము.

ప్రథమరంగము:—సీతాంతఃపురము ముందర వగడసాల.

[ప్రవేశము—లక్ష్మణుఁడు]

(అనుబంధము 11.)

లక్ష్మణ—సీ. పూర్ణగర్భిణి కాన పోఁద్రోసి యిహపర
దూరుఁడై నరకంబుఁ జేరనయ్యె
చెప్పగా రాముండు చేసి యీపాపంబు
శోకమే కన్నులఁ జూడనయ్యె
తల్లులఁ దమ్ముల తల్లడిల్లఁగఁ జేసి
కులపాంసనుండనై తొలగనయ్యె
సాకేతపౌరులు శాపాగ్ని దహియింప
జీవచ్ఛవంబనై చెలఁగనయ్యె
గీ. ఎడరు రానయ్యె, నపకీర్తి పడగనయ్యె;
చెనటి స్త్రీహత్య శిశుహత్య చేయనయ్యె;
వంత విడదయ్యె, రవికుల మంతమయ్యె;
జగతి దుఃఖపు చావింక చావనయ్యె.

ఆహా! లోకమునఁ బాపములకెల్ల నావాసస్థానముగ నా బ్రహ్మ నన్ను సృజించె కాబోలు? నన్ను కడుప్రేమ వెలరారఁజూచి కాపాడు తల్లిని, మా సుమిత్రాదేవితో నేమిటఁదక్కువకాని జననిని, కోప మనునది తెలియక నిరతానుగ్రహ రంజిత కరుణాకటాక్షముల బ్రహ్మాదుల నేలఁజాలు లోకజనయిత్రిని, మా సీతామాతను నాచేతులార నే నడవి నెట్టుడించివత్తును? అక్కటా! శ్రీరాముఁడు

నిన్ను భాగీరథీతీరమునందలి మునిపల్లియలయందు విహరింప సెల విచ్చియున్నాఁడని వచించిన వెంటనే మాజానకీదేవికిఁగలిగిన సంత సమింతింత యనరాదుగదా! అప్పుడే పురమునందంతయు నీ దుస్స హశోకశరోదంతము వ్యాపించియున్నది. పురజనులందరు గజిబిజిగ లోకమే మునిగినట్లు తలంచి, కన్నీరు మున్నీరై పార, వీథులందు గుంపులు గుంపులుగ చేరి పరితపించుచున్నారు. అయ్యో! ప్రజ లందరు నన్నెంత కఠినాత్ముఁడని దూషింతురో కదా? అలనాఁడు మేము యోధ్యాపురముఁబాసి యరణ్యమునకుఁ బోవునపుడు సుమం తునినే పరిపరి నిందించినవారు పరమపాపమున కొడిగట్టిన నన్ను నిందింప మానుదురే! అయ్యో! ఉత్తమగజములు నిశ్చేతుకము గనే తమ శుండాగ్రముల వంచి భూదేవినిఁ గూర్చి మొరఁబెట్టు చున్నవో యనునట్లు తమ దుఃఖమును సూచింపుచున్నవి. పెంపుడు పక్షులు, చిలుకలు, హంసలు మేల్కాంచినవెంటనే ముచ్చటగ తేనియలొలికెడి పలుకుల పలుకక క్రిందబడి పొరలాడుచు, తల్లిలేని పిల్లలకైవడి తల్లడ మొందుచున్నవి. కామధేనువులు ప్రాతఃకాల పూజల నించుకేనియు నాశింపక కట్టిన స్థలములందే తమతమయాహా రములమాని శృంగాగ్రముల విదలించుచు, ముఖమునెత్తి కొని శోకిం చుచున్నవి. లేదూడలు లేపచ్చికల పారదోలి అంబారవములు చేయుచు నమితదుఃఖమును ప్రకటించుచున్నవి. వేయేల? భూమిపై బారు చీమలు సైతము పుణ్యాత్ములు తమకిచ్చు నూకలను తినక, కాళ్ళక్రిందఁబడి చావ నుంకించుచున్నవి. ఇదియంతయు లోకసహ జమేకదా? బుద్ధిలేని సర్వజంతువులును మా జానకీదేవిని విడువఁ జాలక దుఃఖించుచున్న నా దేవదేవి, నాజనని లోకైకజననీత్వమును సూచించుచున్నదిగదా, అదే సూర్యుఁ డుదయించుచున్నవాఁడు. ఇంకను మాజానకీదేవి రాదయ్యె. నానొసట వ్రాసిన యనుభవము ననుభవింపక తీరునా?

(ప్రవేశము—సీత వస్త్రాభరణములతో.)

సీత—లక్ష్మణా! ప్రయాణమునకు సిద్ధుఁడుగ నున్నాఁడవా? నేను కొంచమాలస్య మొనర్చినందులకు క్షమింపుము. మునిపల్లెలందు మునిభార్యలకుఁ గావలసిన సొమ్ములు చీరలు తీసికొని వచ్చుటకు కాల విళంబ మైనది.

లక్ష్మణ—(స్వగతము) అయ్యో! ఏమి యీ వెఱ్ఱితల్లి సంతోషము? తన్నుఁ గాల్పనున్న యగ్నిని తెలియక తానే కౌఁగిలించుకొన నున్నదే? అక్కటా! యిట్టి నిష్కల్మషహృదయ నడవిపాలుచేయ నెత్నించిన పాపాత్ముఁడను నేనుగదా? (ప్రకాశము) తల్లీ! ఇదే సిద్ధుడుగ నున్నాఁడను. ఇయ్యదే రథము సర్వ సన్నాహములచే సిద్ధముగ నున్నది.

సీత—అన్నా! సౌమిత్రీ! శ్రీరామచంద్రునకు నాపై నేఁడెంత కరుణగలిగెను? నే నెన్నఁడో కోరిన కోరికను నేఁడు కొన సాగింపఁదలచి నిన్నంపెఁగదా?

లక్ష్మణ—(ఊరకుండును)

సీత—ఏమి లక్ష్మణా! ఊరకున్నాఁడవు?

లక్ష్మణ—అమ్మా! ఏమియు లేదు. ప్రొద్దెక్కినదని చూచుచు నూరకున్నాఁడను. రమ్ము పోవుదము. వేగమే వెడలవలయు.

(నిష్క్రమింతురు.)



## తృతీయాంకము—ద్వితీయరంగము.

### అరణ్యప్రదేశము.

(ప్రవేశము—రథముపై సీతాలక్ష్మణులు.)

సీత—లక్ష్మణా! ఇదియేమి ఘోరారణ్యములకు వచ్చితిమి? ఇది గంగాతీరమునందలి మునిపల్లియలకు మార్గము కాదే? త్రోవ తప్పితివా? లేక నేనే మఱచితినా?

లక్ష్మణ—(స్వగతము) నే నేమి ప్రత్యుత్తర మిత్తును? అయోధ్యా పురము దూరమగున ట్లంతయు నా ధైర్యసారము దూరదూర

మగుచున్నది. అరణ్య ప్రదేశము దాపునకు వచ్చినట్లంతయు శోక దవానలంబు నా దాపునకు వచ్చుచున్నది. ఏమి చేయుదు ? (ప్రకాశము) జానకీదేవీ! ఘోర కఠిన పాప కార్యారణ్యములఁ జరింప పొమ్మని విధి నానొసట వ్రాసియుండ నరణ్యములుఁ గాక యుద్యానవనములు నాకు దారి నివ్వ నిచ్చునే ?

సీత—అన్నా! ఏమి మాటలు నా కర్థము కాలేదు ! పాపారణ్యమేమి చరించుటేమి? వివరముగా వచింపుము.

లక్ష్మణ—(తలవంచుకొని యూరకుండును.)

సీత—సౌమిత్రీ ! ఏమి యూరకున్నాఁడవు ? ఏల నీ యాననాబ్జము కళావిహీనమై ప్రతిపదియందలి చంద్రునివలె మాసియున్నది ? లక్ష్మణా ! వచింపుమా; నా మానస రాజీవము సందేహవారి పూరంబునం బడి పరితపించుచున్నది. (నిమిత్తములను చూచి) అదే దుశ్శకునములు కనుపించుచున్నవి. ఈదినము వెనుకకు మఱలి పోవుదము, మఱల శుభదినముఁ జూచి ప్రయాణమై వత్తుమట లెమ్ము. లక్ష్మణా ! కంటివే ! అమంగళ సూచకంబులగు జంబుకములు మన తేరువంక పరికించుచు నశ్రావ్య ధ్వనులనుఁ జేయుచున్నవి ! నభోమణియగు సూర్యుఁడు ప్రకాశింపక, గుణములేని వాని విద్యా ధనమువోలె మాసియున్నవాఁడు ! పగటి కాలముననే చుక్కలు పెక్కులు భూమిపై వ్రాలుచున్నవి ! అల్లదే ! చూచితివే ! మన రథమునకుఁ గట్టిన యుత్తమాశ్వము లకారణముగ కన్నీరు విడుచుచున్నవి ! నా మానసమేటికో నావశము గాకున్నది. అన్నా ! నీ కన్నుల నీరేల గ్రమ్ముచున్నది ?

శా. మున్నా రావణు ఘోరశక్తిని ధరనూర్ఛిల్లుచో నాజిలో
సన్నాహంబున నిందజిత్తును నడిఁగా జక్కాడుచో దైత్యులఁ
ఛిన్నాభిన్నము చేయుచో నరయఁగా చింతింప వోలక్ష్మణా !
గన్నీరేటికి గల్గెతండ్రి; చెపుమా కళ్యాణులే యందరుఁగా.

లక్ష్మణా ! లక్ష్మణా ! ఏల మారు పలుకవు ? నాహృదయమున నంత కంతకు భావ్యవర్తసూచకమగు సంతాప మెక్కువ యగుచున్నది. నేఁడేదియో యనర్థము రానున్నది. తండ్రీ ! నేఁడేల నీకిట్టి శోకము కలిగె ? చెపుమా నీపరితాపమునకుఁ గారణము ? పతివ్రతాభామి నులకడ నీ యవినీతి యేమైనఁ గలిగెనా ? సాధువుల, వృద్ధుల, రోగుల నేమైన బాధించితివా ? లేక శ్రీరామునానతి మీరితివా ? అసత్యమున కియ్యకొంటివా? అన్నరో ! శ్రీరామభద్రునకుఁ గుశల మేకదా ? భరత శత్రుఘ్నులకుఁ బ్రమోదమేగదా ? ఊర్మిళా మాండవీ శృతకీర్తులు కుశలవతులేకదా ?

లక్ష్మణ—తల్లిరో ! ఆవృత్తాంత మిప్పుడేల ? గమ్యస్థానమును చేరిన పిదప నీకే తెలియఁగలదు. ఆ యుదంతముఁ దలఁచిన నా మాన సము నీరై పారుచున్నది. నానోటినుండి నే వచింపఁజాల.

సీత—లక్ష్మణా! ఏమో నీచారిత్రము విచిత్రముగానున్నది. నీవేదియో పాపకార్యమున కొడిగట్టి నన్నింతదూరము కొని తెచ్చినట్లున్నది. నడచిన వృత్తాంతము వచింపవైతివా యీపాపాచరణము నీతలపైన నుంచఁబడును. ఘోరారణ్యమున కొక్కయబలను కొని తెచ్చుట యన్న సామాన్యము కాదుసుమా ? నీవు పరిశుద్ధుఁడవో లేక కల్మ షుఁడవో నాకుఁ దెలియదు.

లక్ష్మణ—(సీతపాదములపైఁబడి) అమ్మరో ! నీనాథుఁడు శ్రీరాముఁడు నన్నాజ్ఞాపించిన సకలలోక గర్హణీయ ఘోరహింసా కార్యరూప కాలానలమున కాలి, క్షణమునకు నూడిపోవు న జీవితమును నీకఠిన తర నిందావాక్య వజ్రధారచే నట్టె నలచివైచితి. తల్లిరో ! ఎట్టి పాతకకార్యమును నాపై సందేహించితివి ? ఎట్టి యవాచ్య నిందకు నన్ను లోఁజేసితివి ? జననీ ! శ్రీరాముఁడు నీ మనోనాథుఁడు నా తలపై నిడిన ఘోరహింసా రూప శాసనమును నిర్వహించి నీకు దుర్భర సంతాపమునుగూర్చి కలుషాత్ముఁడనై మనియుండవలసి వచ్చెనుగదా యను శోకభరంబు మదీయ కంఠంబు బిగించి నిరుత్త

రుఁనిగాఁ జేసినందున పరితపించుచుంటిని. అదియు నా దౌర్భాగ్య వశమున నీనిశితవాక్య ఖడ్గంబునకు నన్ను పాత్రునిఁజేసె. తల్లిరో! నీకు మదికెక్కినశిక్ష విధింపుము. వలదనను. కాని నీ నిందాభాషణ క్రూరకరవాలమునకుమాత్రము నన్నప్పగింపకుము. నే పరమ పాపుఁడ. పరలోకదూరుఁడ. పశ్చాత్తాపమన నెట్టిదో యెఱుఁగని వాఁడ.

(అనుబంధము 12)

సీత—అన్నా! స్త్రీచాపల్యమున, ఆతురభావమున, పరిశుద్ధ మానసుఁడవైన నిన్నెంతయో నొవ్వనాడితిని. క్షమియింపుము. తండ్రీ! ఏమి, ఏమి, శ్రీరాముఁడు నాపై నున్న మమత నంతయు వీడెనా? (నిష్క్ర-మా-) నే నే మపరాధ మొనర్చితి? నేనేమి చేయరాని చెయిదములఁజేసితి. లక్ష్మణా! మనము వేగిరపడుచున్నది. శరీరము తూగాడుచున్నది. చెప్పుమా! చెప్పుమా! ఉదంతమంతయు సవిస్తరముగఁ జెప్పుమా.

లక్ష్మణ—జననిరో! నానోటినుండి యాయుదంతము వచింపఁజాల! నీ యానతియు మీరఁజాల. ఇంకేమిచేయుదు? లోకాపనిందకు తాళఁజాలక నీ నాథుఁడు నిన్ను ఘోరాటవిని విడచి రమ్మని నన్నాజ్ఞాపించెను.

సీత—(ఆతురమున) లోకాపవాదమా! నాపైనయా! ఎవ్వరు! ఏవేళ! ఏ యపనింద మోపిరి! ఎవ్వ రీదంపతులఁ బాపుట కొడిగట్టిరి!

లక్ష్మణ—అమ్మరో! ఎవ్వడో మద్యపానియగు నొక్క చాకలి తగవులాడిపోయిన తన భార్యను పరిగ్రహింపుమని యూరివారు చెప్ప నే నేమి "రాముఁడనా పగవాని యింటనున్న భార్యను పరిగ్రహించుటకు" అని నుడివెనఁట. దానికై శ్రీరాముఁ డది యొక కొండగా మౌర్ఖ్యముపట్టి నిన్నిచ్చట త్రోసిరమ్మని నన్నంపెను. నా ప్రాణముల నైెత మీ ఘోరకార్యాచరణమున గలిగిన పశ్చాత్తాపమున నిదే యడవిని ద్రోయ నన్ను నియమించెను.

సీత—హా! రామా! రామా! రామా! (మూర్ఛిల్లును)

లక్ష్మణ—అయ్యో! ఈ తల్లి మూర్ఛిల్లె. (శైత్యోపచారములఁ జేయుచు) ఆహా! ఇంతదుఃఖమునకు మూలము నేనుగదా! ఈ సంతాపమెట్లు భరింతును? ఈతల్లి సంతాపము నెట్లు తిలకింతును?

సీత—లక్ష్మణా! లక్ష్మణా! (లేచును.)

లక్ష్మణ—అమ్మా! ఆపాపిలక్ష్మణుఁ డిదే యిందే యున్నాఁడు. ఇంకను జీవించియే యున్నాఁడు.

(అనుబంధము 13.)

సీత—లక్ష్మణా! శ్రీరాముఁడు తన నోరార యీ మాట లాడెనా? నానాథుఁ డిట్టి యపోహ వార్తను విని నమ్మఁగలిగెనా? నాపైనున్న మమతయంతయు తొలఁగెనా? ఇది యంతయు తథ్యమని విశ్వసింపఁ గలిగెనా? ఇది నిజమా! రామా! తారకనామా!

సీ. చిన్ననాటనుగోలె నిన్నె దైవముగాఁగ
నెన్నియుండిన భక్తి నెన్నవలదె
అల రావణునిబాధ లన్ని నేనోర్చి నీ
కొఱకునై మనుట యింతరయవలదె
బంధుల రాజ్యంబు, బాసి నే నీవెంట
కానకువచ్చుట కాంచవలదె
అనదయే, దీనయే, అబల, గర్భిణియంచు
నను బ్రోవ సత్కృప కరగవలదె
గీ. మనసురాయియె నీకు నో మనుజపాల
భువన నుత నామ రవికులాంబోధిసోమ
దానవవిరామ సత్కృపాధారసీమ
రమ్యగుణధామ శ్రీరామ రామరామ.

లక్ష్మణా! శ్రీరాముఁడు, నామనఃకాముఁడు, ఆనందధాముఁడు నన్ను సందేహించెనుగదా? నీయట్టివారు చెంతనుండియు, ఇది తగదనియు,

నిట్టిది కలదా యని యుఁ జెప్పకపోతిరా! కట్టా! ఆబాల్యమునుండి కడు ప్రేమనిండార, పెన్నిధానమువోలె, జీవితముబోలె నన్నెంత యు యరయు నామనోనాథుఁడే నాపై నక్కటికమూనక నట్టడవిని ద్రోసియ నింకెవ్వరు చెప్పువారు? యింకెవ్వరు రక్షించువారు? అయ్యో! 'రామ' 'రామ' యనెడి రెండక్షరముల జపమొనర్చుచు, "రామ" యని నుడివినవారి యాత్మబంధువులుగ గాంచుచు ఆరామ మూర్తినే మానసకమలాసన కనకపీఠముననిడి దైవముగ పూజించు నామనశ్శుద్ధి నింతారయఁడాయెగా? శివధనువు దునుమాడినవేళ మొదలు సహకార సల్లాపములమాని, శైశవ క్రీడా వినోదము విడ నాడి, జననీజనకుల గారాబులొలికెడి సరసంపు పలుకులనైన దూరీ కరించి, పుట్టినింటి వాసమును త్యజించి; ఆత్మబంధువుల నావలద్రోలి తన్నే సర్వస్వముగా భావించు నా మనస్థైర్యము తెలియఁడాయెగా తా నడవికేగుతఱి, ముఱిపెంపు రాయంచల లేపలుకుల కులుకుఁ జెందు దాననయ్యు, సింహశార్దూలాది ఘోరమృగారావములకైన నోర్చి, సంపెంగ తేనియల కాలువల దాటుట కెంతయో పేరాయా సముఁ జెందుదాననయ్యు, దుస్తర భాగీరథీప్రవాహసంతరణంబున కైననోర్చి,భీకరారణ్యముల తనవెంటరా, తన్నేప్రార్థించుటయోచిం పఁడాయెగా! నాయాత్మశుద్ధి స్మరయఁగోరి, 'అగ్నిజ్వాలలపడు' మని తననోటినుండి మాటవచ్చియు రాకమును పే భీకరానలంబునఁబడుట విచారింపఁడాయెగా? అజరుద్రాదులు నా సౌశీల్య పాతివ్రత్యముల చాటించి యగ్గడించుటసైతము కనుగొనఁడాయెగా? వినోదము చేయుచు తాను కనుపింపకపోయినపుఁ డదియే జగత్ప్రళయమని భావించు నాప్రేమను తలపఁడాయెగా? లంకలోనుండునపుడైన ప్రళ యార్కబింబముఁబోలె, నొక్కరికి తేరిచూడరాకుండ, కాలరుద్రుని కంటిమంటవలె నెవ్వారికిని చేరరాకుండ యాత్మ పాతివ్రత్యమును కాపాడుకొన్న నాసాధ్వీచారిత్రము నించుకైనమదినిఁగొనఁడాయెగా?

సౌమిత్రీ! అంత తనకు గోపమున్నఁ దనకరవాలమున నింతింత ఖండించియుండిన పరమ సంతసమున భరించుచుంటినే? నే మనియుండుట తనకిష్టములేకున్న, కాలకూటవిషము తన చేచేత నిచ్చియుండిన నదియే పరమామృతమని కొనుచుంటినే? నే నంత కనువేగైన మఱల "మండునగ్నిగుండమునపడి మడియు" మని శాసించియున్న నాతని సంతసమునకై పడుచుంటినే? అయ్యో! నా కుయ్యాలించువారు లేని లోకనింద నాతలపైననిడి, నవమాసాంతర్వర్తినియైయున్న నన్నడవుల దోసెకదా! నే నెట్లు భరింతును! ఎవ్వరితో మొఱలిడుదు? ఏమహాత్ముల శరణొందుదు! అకటా! నాపై దయలేకున్నను నాగర్భమున వృద్ధినొందుచున్న నాశిశువునందైనఁ గనికరము కలుగదాయెగా? అయ్యో! పరమశాంతశ్రీనిధియగు శ్రీరామచంద్రుఁడని భావించియుంటినిగాని కఠిన స్త్రీశిశుహింసకుఁ డగునని యెఱుఁగనైతిని. నిరుపమాన సద్గుణభూషితుఁడని మాతండ్రి జనకుఁడు కన్య నిచ్చెగాని యిట్టి గోముఖవ్యాఘ్రమనియు, నిట్టిగంధమువూత కత్తియనియుఁ దెలియకపోయెగదా? లక్ష్మణా! ఇఁక నీవుపొమ్ము. తండ్రిరో! నీవదినె, నీవు భక్తి సేవించు జానకి నిఁక మఱచిపొమ్ము. మా యత్తగారగు కౌసల్యా సుమిత్రాది దేవులతో నాకడపటి యభివాదముల వచింపుము. తమకుఁజెప్పక వచ్చినందున తగుఫల మనుభవించితిననియు, "మీకోడలగు సీత మీయెడ నేమి యపరాధముఁ జేసియున్నను మన్నించి బ్రోచిన మరణవేళ సంతోషమునఁ బ్రాణముల విడుచుననుము. అన్నరో! భరతశత్రుఘ్నులకు నాయాశిషంబుల దెలుపుము. "మీ శుశ్రూషల, మీభక్తిపూజల, మనసార గైకొను భాగ్యము లేదయ్యెగా యని మీ వదినె సీత పలవించి ప్రాణముల విడువనున్న"దని చెప్పుము. అన్నరో! మీయన్నతో, "సీత, నీవు దూరీకరించిన సీత, నీయట్టివానికి సైతము నిష్కరుణ గలిగించిన నిర్భాగ్యపుసీత, సమభక్తి భావనతో నీపాదారవిందములనే, ధ్యానిం

చుచు, నీవుచేసిన మహోపకారమును మదిఁదలంచుచు, నీదయా గుణమును కొనియాడుచు ప్రాణముల వాసె” నని వచింపుము.

సీ. అరయకౌసల్యాది యత్తల నడిగి నా
వందనంబుల నీవు వలుకు మన్న
భరతశత్రుఘ్నుల కరయ నాకడసారి
దీవనలను నీవు తెలుపు మన్న.
మా రామచంద్రుతో మరణవేళను తన్ను
నడిగితినని నీవు నుడువు మన్న
ఇఁకనైన నపకీర్తి యేమియు లేక తా
హాయిగ నిద్రింపు మనగదన్న

గీ. తన్ను దైవంబుగా నమ్మియున్న కాంత
కకట ప్రతిఫలంబిదియె యం చనగదన్న
తనదు యుపకృతి మఱువనం చనగదన్న
మహిని యీజానకిని నింక మరువకన్న.

“చాకలివానిమాటలే వేదమంత్రములుగాఁ దలంచిన నీదయారసమును మిక్కిలి కొనియాడె” నని తెలుపుము. ఇఁకనైనను చల్లగనిద్రింపు మనుము. ఏయపవాదమును లేక సుఖముగా నుండుమనుము. తనకే దయగలిగిన చచ్చి పరలోకమున నున్న నన్ను నెపుడైన స్మరింపు మనుము. ‘జన్మజన్మాంతరమునందైనను నిన్నే తనకు పతిగా చేయు మని వేనవేలు దేవతులకు మ్రొక్కె’ ననుము. ఏదిలేకున్నను చచ్చు నపుడొకటి ప్రార్థించితిననియు; అదేదన, మాతండ్రి జనకరాజునకుఁ జెప్పి వంపుమనుము. దివ్య నీలనీరద సంకాశమై, నీరజ విలాసనుం దర నేత్రారవిందమైన తనమూర్తిని నా మానసమున ధ్యానించు చుంటి ననుము. నాయందు చూపినదయ నిం కెవ్వరియందును చూపవలదనిమాత్రము ప్రార్థించితి ననుము. తన మనసునకుఁ దెలి యుని లోకనిందల నమ్ముట కాత్మసాక్షి లేదా యనియు, మానస

శుద్ధిని క్షణక్షణమును తెలుపు అంతస్సాక్షి లేదాయనియు, సర్వ కార్యముల నిర్దయం దెఱుంగుచు మానవుని కాపాడఁగల జీవసాక్షి లేదాయనియు, తానెంతనింద నాపై మోపినను వారైన నా పరిశుద్ధత నొకప్పుడైన తెలుపుదురని వచించుచు నాయంత్యకాల పాదాభివాసముఁ జేసి నాజీవితమును తనపాదములకు కానుకగా నర్పించితి నని నుడువుము. లక్ష్మణా! పోయిరమ్ము.

అన్నా! నేనెంత నిన్ను నొవ్వనాడియున్నను వానిని మదియందుంచకుము. నీ యుపకారము నీజన్మమున తీర్పఁజాలక పోయితినిగదా! ఉత్తరజన్మముననైనఁ దీర్తునఁటలెమ్ము. నాకై యెంతయో కష్టించితివి. నాకై నిద్రాహారముల మానితివి. వాటి నన్నిఁటిని నే మఱువను. కన్నపుత్రునిబోలె నున్న నీతో మాటలాడనైతిని. నిన్ను గన్నులార చూడనైన జూడనైతిని. అకటా! నాకెవ్వరు దిక్కు? నా గర్భస్థ కుమారుల కెవ్వరుదిక్కు? ఓ శ్రీరామా! తారకనామా! వైకుంఠధామా! నామానసకామా! రావే! నా మొఱాలింపవే! అయోధ్యా! ఈనాఁడు నీ ఋణము నాకుఁ దప్పెనా? హా! రామా! రామా! (మూర్ఛపోవును.)

లక్ష్మణ—అయ్యో! పరమ నిర్భాగ్యలక్ష్మణా! నీవు నేఁ డెట్టికార్యము చేయఁ బాల్పడితివి? అమ్మరో! జానకీదేవీ! నావలన నీకెట్టి యిడుములు గలిగె? దశరథరాజేంద్రుని పెద్దకోడలివై, విజ్ఞానధనుఁడగు జనకరాజేంద్రుని కూర్మి పుత్రికవై శ్రీరామభద్రునకు పట్టపుదేవివై, సకల ప్రపంచమును రక్షించు తల్లివై, నీవెట్టియిడుములఁ బడితివి? నిన్ను నేనెట్లు నట్టడవిపాలుచేసి పోవుదు? విధిలేదు. పోవ నేవలయు. నా కానతిమ్ము. తల్లీ! నిన్ను విడనాడి నేఁబోవుట యనుపట్టణమునకుఁగాని యయోధ్యాపురికిఁగాదు.

(పోఁబోవ)

(అనుబంధము 14.)

సీత—లక్ష్మణా! పోయెదవా? పోయెదవా? హా! రామా!
(అని మఱల మూర్ఛిల్లును)

లక్ష్మణ—(మఱలవచ్చి) అయ్యో! ఈదేవదేవి దుఃఖమును నే నెట్లు తిలకింతును? శ్రీరామశాసనము నెట్లు మీఱుదును? నేనేల నా సుమిత్రకు జన్మించితి? కట్టా పుట్టినప్పటినుండి దుఃఖపరంపరల నోలలాడు నాయట్టివాని జన్మ మేమిఫలమును సాధించును? అకటా! ఈతల్లిని లోకములఁగన్నతల్లిని, అయోధ్యాదేశపు ప్రజలను గన్న తల్లిని, నన్ను రక్షించుతల్లిని నే నెడఁబాయఁగలనే?

సీ. జనకరాజేంద్రుఁడు జ్ఞానగర్భమునందు
జెన్నార పెంచుచు నున్నతల్లి
పొంగుపారు ప్రేమచే భూసతీమణి చెంత
ముద్దులపుత్రియై మొనయుతల్లి
చల్లనితల్లియై యెల్లరనోకమాట
యైననాడని శాంతమలరుతల్లి
పారిశుద్ధవజ్రంబుఁ బోలె నేదోషంబు
ప్రేలఁజూపఁగరాక వెలయుతల్లి
గీ. కరుణఁగలతల్లి లోకముల్ గన్నతల్లి
వేదములతల్లి వేడ్కల వెలయుతల్లి
తల్లులకుఁ దల్లి ముమ్మూర్తి తనరుతల్లి
పరగ మాతల్లి మాతల్లి బాయఁగలనే.

ఓజానకీదేవీ! అనవరతము రారాజులు, వారి దేవేరులు నిజశిరఃకిరీట మణిమాలికలు భూమిసోక వందనంబు లిడ మకుటమణిమయపీఠ ముల వెలరారు నీపాదారవిందములు నేఁడు క్రూరమృగభక్షిత జంతుశవములపై ప్రకాశింపవచ్చునా? సనకాది మునివరమానసేందీ వరములపై శ్రీరామచంద్ర వామాంకపీఠముపై, వేదసీమంతినీ సీమంత వీథిపై రారంజితలీల భాసిల్లు నీపావనశరీర మీకంటక సముదయములఁ బడనయ్యెఁగా?

సీ. నినుఁజూచి కదల నేరని మృగంబులు నీకుఁ
గాన్పు చేసెడివారె కన్నతల్లి
చరియించు భల్లూక సతులు పేరంటంపు
ముత్తైదువలె నీకు భువనజనని
కనరాని యీముండ్ల కంపల నీడలు
రమణీయనగరులే రామపత్ని
వెక్కసంబుగదోఁచు నక్కల కూతలు
పుణ్యాహ ఘోషమే భూమిపుత్రి!

గీ. వేడికన్నీటముంచు నీ యేడ్పుదినము
ఒప్పు సీమంత పుంసవనోత్సవంబె
మాత, యోత్రిభువనభూత, మహితజాత
నిరతగుణజాత, యోసీత, పరమపూత.

అకటా! జననీ! పుట్టినదిమొదలెన్నియో దుఃఖములను గాంచుచున్న దానవుగాక యెక్కనాఁడైనను సుఖమనునది లేకపోయెఁగా?

సీ. పుట్టినదాదిగా పొరిదుఃఖములెగాక
యావంత సుఖమొందవైతివమ్మ
అత్తవారింటిలో నమర భోగమునున్న
నడవిత్రోలుటె నీకు నాయెనమ్మ
రఘురాముపత్నివై రహినింటనొకనాఁడు
నలరనుండగ నేరవైతివమ్మ
శ్రీరాముతోఁగూడి గృహమున సుఖముల
ననుభవించగ నోచవైతివమ్మ

గీ. ఇంతి యడవిని నెట్లు చరింతువమ్మ
ఎంచి ప్రాణములెట్లు భరింతువమ్మ
చేరి యక్కట విధియెంత చేసెనమ్మ
మరలనెప్పుడు మమ్మేల మనుతువమ్మ.

ఓభాగీరథీతీర తరువులారా! ఓ శార్దూల భల్లూకాది వన మృగము లారా! ఓ యరణ్యలతానికుంజములారా! మీరు నోచిన పుణ్యము నేను నోచనైతిగా? ఈలోకమాత, ఈజగత్కల్పవల్లి, ఈ సాధ్వీమతల్లి సేవించి భక్తిచే నామెకు నాశ్రయమిచ్చి మీరెనలేని పుణ్యముగట్టుకొనుచున్నవారు. నాకట్టి భాగ్యము లేదయ్యెగా? అయ్యో మా దేవదేవిని, మా జానకీదేవిని మీకప్పగించి పోవుచున్నాడ. మీరెట్లు కాపాడెదరో? మీరెట్లు నాతల్లికి నూరట గలిగింతురో గదా? అకటా నాకు పోవుటతప్పదు. ఈ జానకికి గడపటి నమస్కారము గావించి పోయెదగాక.

సీ. తొలిజామున నలేచి లలిత భక్తిని జేయు
పరగ ప్రాతఃకాల వందనంబు
పనివేళ లక్ష్మణా! యనిపిల్వ నమ్రుడై
వాసి నేఁజేయు సద్వందనంబు
వనిలోన ఫలములఁ గొని తెచ్చి యర్పించి
వరదాస్యమున జేయు వందనంబు
మము నేలురాజ్ఞివై మనుపుచోఁ బుత్రుని
భంగి నే సల్పెడు వందనంబు

గీ. ప్రణుతిశతములు రాఘవపత్ని నీకు
అమిత వందనములు జగదంబ నీకు
దివ్యసాష్టాంగములు రామదేవి నీకు
పెక్కు మ్రొక్కులు భూదేవిబిడ్డ నీకు

అయ్యో! ప్రాతః సంధ్యాకాలములయందు త్రికాలాభివాదముల నేఁ జేయ మా సీతామాత మందహాస భాసురమగు సంపూర్ణానుగ్రహమునఁ దన కరాబ్జమును నాశిరముపై నిడి మంగళాశిషంబుల నిడుటఁ గాంచితిఁగాని ఇట్లు ఘోరతరశోకమున మూర్ఛిల్లి యుండుటఁ గాంచ నైతిగా? ఓ పావహస్తములారా! ఇన్నిదినము లీతల్లిని పూజిం

చుచుంటిరో, వింజామరలఁబూని పాదారవిందముల ధరించి, శ్వేత ఛత్రముల గ్రహించి యేలోకమాత ననవరతము భక్తి సేవించి ధన్యులగుచుంటిరో, అట్టి రామ సామ్రాజ్య లక్ష్మినిమీరీనాఁడు భీకరారణ్యమునఁ ద్రోలి భయంకర మృగములపాలుఁజేసి పోవనుద్యమించితిరా? అక్కటకటా! సూర్యవంశక్షీర వారాశియందు నిరత కలుష హాలాహలముఁ బోలె నే నేల జన్మించితి? శ్రీరామచంద్రుఁ డప్పుడు గలిగిన కోపమున సీత నడవుల విడిచి రమ్మనెఁగాక చేతులార విడిచినవాఁడను నేను గదా? నే నట్లు చేసి పోయిన వెంటనే నన్నెంతయో నిర్దయాత్ముఁడని నిందింపఁడా? అమితక్రోధోద్భవోర్మి మాలికలు మనోవారధిని సంచరింప నట్లన్నమాత్రమున నిట్లు చేయఁ బాడియే, యని దూషింపఁడా? భరత శత్రుఘ్నులు కన్నతల్లి నిఁకా రడవులఁ ద్రోలిన పాపాత్ముఁడని నాపాపపుమోముఁ జూతురా? కౌసల్యా సుమిత్రాదులు మా కోడలిఁకిఁ బడరాని యిడుమల నోడిఁ గట్టిన కూళుఁడవే యని నన్ను పరిపరి దూషింపరా? అయోధ్యా పురజనులందఱు నాబాలగోపాలము నన్ను తేరి చూడక తమ కన్నీళ్ళచే నాకు శాపోదకము లిచ్చుచు లోకనిందిత దుష్కర్ముఁడని దినదినము నా ప్రాణములకై ప్రలాపించరా? జనకరాజేంద్రుఁడు పీఁడెట్టి పుణ్యహీనుఁడని దూరీకరింపఁడా? అకటా! ఎందరికిఁ గాని వాఁడనైతిని? ఎంత యపనిందల పాలైతిని? ఎట్టి దుర్భర కలుషాత్ముఁడనైతిని? ఎట్టి పరమహేయ నరకపాత్రుఁడనైతిని? పుణ్యదూరుఁడనైతిని. రామునకుఁ గానివాఁడనైతిని. బంధువులకు ద్రోహఁ గలిగించితిని. తల్లుల కెడమైతిని, తమ్ములకు దూరుఁడనైతిని. వేయేల, సర్వలోకములకు దూషణీయుఁడనైతిని, పాపపుమోముఁ జూపకఁ బరమనీచుఁడనై కలకాలము దుఃఖమున నశించి నశించి యిహలోకముఁ బాయవలసి వచ్చెగా? అక్కటక్కటా! ఇపుడు కదలాడు పంచప్రాణములారా! నన్నేలఁ బాయకున్నారు? ఇపుడింత పరితపించుచున్న కటికమానసమా! నీవేల పగిలిపోవ

కున్నావు? సర్వపాప నిచయాలవాలమగు ఓ దూషణీయ లక్ష్మణ శరీరమా! నీవేల కుళ్ళి నీరై మంటఁ గలియకున్నావు? ఓ జానకీ దేవీ! నేఁడు మమ్ములఁ బాసితివా? అయోధ్యాపుర భాగ్యలక్ష్మి, మాకుఁ దప్పితివా? సకలపుణ్య పరిశుద్ధ జగన్మాతరో! నాతో నొక్క మాటాడవే. హా! భరింపఁజాల! అయోధ్యాపురమా? నిన్ను నేచూఁడజాల. జీవింపజాల సకలకాలాగ్ని విషపర్వత సర్వ శాస్త్రాల సమస్తాయుధములారా! నాపై యేల మీకు దయకలి గెను? దేవవర్గములారా! పక్షిసముదయములారా! మానులారా! నక్షత్రములారా! మీరు మా సీతాదేవిని రక్షింపుఁడు. పరేత లోకమునను్న దశరథభూపాలచంద్రమా! నీకోడలిని నీకప్పగించి పోవుచున్నాఁడ. నీవే రక్షించుకొనుము. హా! సీతా! రామా! పరమ నిర్భాగ్య లక్ష్మణా! సీతా! సీతా! (మూర్ఛిల్లును.)

(యవనిక పడును)

---

## తృతీయాంకము—తృతీయరంగము.

భాగీరథీ తీరారణ్యము:

[సీత పరుండియుండి లేచును]

సీత—(నలుదిక్కులుచూచి) లక్ష్మణా! లక్ష్మణా! పోయితివా? పోయితివా? ఇఁక దిక్కులేనిదాన నైతిని. ఎందఱు బంధువులు కలిగియుండియు తుదకు దిక్కులేక యడవిని జచ్చుటాయెఁగా? నీచములగు నాప్రాణములనైనఁ బాయుటకులేదే? ఈపాడు గర్భము నాకెక్కడి శత్రువయ్యెను? లోకాపవాదమా! నీవు నాకెక్కడ దాపురమైతివి! రామా! రఘుకులధామా! నేఁడేల నాకు రాముఁ డవు కాకఁబోయితివి? లంకలో నున్నపుడు కొంతకాలమునకే తాళ లేనివాఁడ విపుడు మద్వియోగము నెట్లు కలకాలము భరింతువు? అలనాఁ డనసూయ నీతో వచించిన యుపదేశమును మఱచితివిగా?

నీయట్టి క్రూరమానసు లెందైన నుందురే? నిరపరాధిని నన్నింత బాధించెదవా? ఆబాధ నిన్ను బాధింపక మానునా? నీవు చేసిన ఘోరకార్యము నిన్నెన్నఁడైన పగనొందింపక మానునా? నిన్ను నమ్మినందులకు మంచి ప్రతిఫల మిచ్చితివి. నీవు చేసిన బాసలకు మంచి ప్రయోజనము నొసంగితివి. రాముఁడుదయాళువు. రాముఁడు సద్గుణధాముఁ డనుటకు మంచియోగ్యతను గల్పించితివి. నేను చచ్చినప్పుడైన నీ ధర్మమును నా ధర్మమును జగమెఱుఁగుగాక. నాశవమునుఁ జూచిన ప్రతిజంతువును నా సౌశీల్యమును పరీక్షించునుగాక. నీవు వంచకుఁడవు. కఠినుఁడవు. పరుల మాటలను నమ్మెడివాఁడవు. నిన్ను బ్రహ్మ నాకొఱకై సృజించెఁ గాబోలు. నీవును, నీతమ్ములును, నీతల్లులును సుఖముగా నుండుఁడు. నాగతి యెట్లైన నేమి? నన్నింత గాసినొందఁజేసినందుకై సర్వ శక్తి, సత్య శక్తియైన నిన్ను దుఃఖమున ముంచదా? (యోచించి) అకటా! మా రామచంద్రుని దూషించుచున్నదాననే? మా రాముఁడా? సూర్యవంశ కలశవారాంబుధి సోముఁడా? తారక నాముఁడా? దూషింపఁదగినవాఁడు? కాఁడు, కాఁడు. కాకున్న దీనికేమన వలయు?

అయ్యో! పురాకృత పాపఫల మనుభవింపక పోవునేఁ పరమశాంత శ్రీనిధి యగు శ్రీరామచంద్రు నంతటివానికి సైతము నాపై నిష్కరుణ కలుగవలయునన్న నాదుర్విధి నేమందు. అకటా! శరీరము తూలెడు అంగములు కంపమొందెడిని. ఇంద్రియములు నావశము కాకున్నవి. అకటా! నిలువఁజాల. తాళఁజాల. భరింపఁజాల. రామా! శ్రీరామా! ఏల కాన్పింపవు? రాజలలామా! ఏల నన్నాదరింపవు? కోదండరామా! ఏల దూరము పోయెదవు? తారకనామా! నను చేరరావే. వలదు. వలదు. నాపై కోప మూనవలదు. నీవు కనికరింపకున్న నీసీత ప్రాణముల భరింపకల్గునే? నీరజవిలాస సుందర నేత్రారవిందమగు నీమోముదమ్మి నొక్కపరి నను దిలకింపనిమ్మా! నా

ప్రాణపంచకమును కానుకగొనిన్మైన యొక్కవరి నీ దర్శనభాగ్య మొసంగుమా ? అయ్యో ! ఈ నిర్భాగ్యురాలి కింకెక్కడి శ్రీరాముడు? ఇంకెక్కడి సంతోషము ?

ఓజనకా ! నన్నేల యింతకాలము పరిపాలించితివి ? సకల సురాసుర మానవవర్గహృదయ సంస్తవనీయలోక ప్రకాశితసత్యమా ? నేఁడేల నావంతఁ బాపవైతివి? నిరత చరాచర జీవజంతుస్థాన విరాజమాన పరబ్రహ్మచైతన్యమా ? నేఁ డేల ధర్మాధర్మముల వేరుపఱుప వైతివి? బ్రహ్మాండ కల్పనాధురీణచతుర్ముఖుఁడా ! న న్నేల లోక భారముగ సృజించితివి? ఓభూసతీరత్నమా? సప్తకులాచల సముద్ర పరిభాసురవైన నీవు న న్నేల గంటివి! నాదుఃఖమును చూచి యేల యుపేక్షించియున్నదానవు! నే నిక్కంపు పతివ్రత నగుదునేని, మా రాముఁడు సత్యప్రజ్ఞుఁడగునేని భూదేవీ ! కొనిపొమ్ము నన్ను నీ—
(లోపలనుండి తాళుము తాళుము)

[ప్రవేశము: శీఘ్రయానమున వాల్మీకి]

వాల్మీకి—జానకీదేవీ! తాళుము, తాళుము,

ఉ. తాళుము దాళుమమ్మ మృతిఁదాల్పగ నేటికి చాలునమ్మ మ
మ్మేమెఱుతల్లి నీకు నిటులేటికి శోకము గల్గెనమ్మ యో
బాలరో! ఆత్మహత్య కడుపాపముఁ దెచ్చుఁ గదమ్మ జానకీ
చాలును సాహసంబిఁక విచారము మానగదమ్మ యమ్మరో,

తల్లీ! ఎంతటి సాహసకృత్యమున కుద్యమించితివి ? ఈకానల కేల చను దెంచితి,

సీత—మానిచంద్రమా ! ఆయుదంతము నే వచింపఁజాల,

వాల్మీకి—అమ్మరో ! నీవు చెప్పకపోయినను నా జ్ఞానదృష్టిచే నే నంతయు నెఱుంగుదును, అపవాదభయమున నీనాథుఁడు రామ చంద్రుఁడు నిన్నడవులకు నంపెగా ? నిన్నపరాధినిఁగా నెంచెగా ? అకటా ! యేమి కాలమహిమ !

సీ. బ్రహ్మాదులనుఁగన్న మాతవౌ నీపైన
నేమూర్ఖు లపనింద నెన్నిరమ్మ
ఎన్నిన నేమాయె నినకులేశుఁడు దాని
నెమ్మది నెట్టుల నమ్మెనమ్మ
నమ్మఁబో నదిగాక నెమ్మిపోవఁగ నిన్ను
తల్లిరో యెటులాయఁ దలఁచెనమ్మ
తలఁచెగా కదిచూడ ధర్మంబుకాదన
కడవుల నెటు నిన్ను విడచెనమ్మ

గీ. నారి యాపురిఁ బెద్దలు లేరఁటమ్మ
అరయ మీయత్తకౌసల్య యైనఁ దనకు
బుద్ధియేటికి చెప్పకఁ బోయెనమ్మ
ఇంక మాయమ్మ మదినూరడిల్లుమమ్మ.

(అనుబంధము 15)

దేవీ! నీవు పరాశక్తివికావా? సంకల్పమాత్రమున సర్వమును చేయఁ గలవు. సర్వమును నాశనమొనర్పగలవు. సీతారాములుగా నుద్భ వముఁజెందిన లక్ష్మీనారాయణులగు మీకు వియోగము ఘటిల్లుట మా బోటివారికి నీదర్శనమబ్బు ఫలము కలిగియుండుటచేతనే కదా? తల్లిరో! ఇచ్చటనే నా యాశ్రమమున్నది. కొంతకాల మందు నివాస భాగ్యము నాకొసంగుము. నన్ను కృతార్థునిఁ జేయుము.

సీత—వాల్మీకిఋషిచంద్రమా! నదీప్రవాహమునఁ బోవువారికి తెప్ప దొరికిన ట్లపారదుఃఖ ప్రవాహముఁలఁ బడిపోవు నాకు నీయనుగ్రహ మను నొక తెప్ప దొరికెను. అవశ్యము మీపుణ్యాశ్రమమున మీ యానతియగువఱకు వసించి నాశరీరముఁ బవిత్రము చేసికొనియెద, అయిన—

వాల్మీ—జననీ! సంశయింపకుము. కాలమొక్కరీతి యుండదు. నీకై మరల శుభకాల మెదురుచూచుచున్నది. రమ్మా నేసంతయు వచియించెద.

సీత—భాగ్యము.

(నిష్క్రమింతురు)



## తృతీయాంకము—చతుర్థరంగము.

వాల్మీకాశ్రమమున నొక కుటీరము.

[ప్రవేశము:—సీత.]

(అనుబంధము 16)

సీత—ఆహా! ఇక్కడికి దాదాపున మూఁడు సంవత్సరములయినది. నా మనోనాథుని యుదంతము తెలియక, నాకీ జన్మమున శ్రీరామ చంద్రుని ముఖముఁ దిలకించుభాగ్యము కలదో లేదో తెలియదు. ఈ వాల్మీకిమునిచంద్రుని యాశ్రమమున నాకేకొఱంత లేకయుండి నను నానాథునివిడనాడిన లోకమే నాకు పాడై తోచుచున్నది గదా! ఆముని మందాఁరుడు 'అమ్మా! నీనాథుఁడు రామభద్రుఁడు క్షేమముగా నయోధ్యయం దున్నాఁడని నన్ను పరిపరి నూరడించు చుండును. నాకు జనించిన 'లవకుశు' లను కుమారులను కడు గారాబమునఁ బెంచుచున్నవాఁడు. వారికి వివిధవిద్యాపారము బోధించుచున్నవాఁడు. ఆహా! ఈ కుమారులఁ గాంచిన మనసున నున్న దుఃఖమంతయు మాసి వారి ముచ్చటల నాలించుటవలన లోకమునే మఱచుచున్నదానను. వారు కొంచము కనుమరుఁగైన యెప్పటి శ్రీరామవియోగమువలనఁ గలిగిన దుఃఖమే "నే నున్నా" నని పైనఁ జేరి నను బాధించుచున్నది గదా?

(లోవల ధ్వని—17 వ అనుబంధములోని పల్లవి)

అల్లదే! నాకుమారులు లవకుశులు వచ్చుచున్నట్లున్నది.

(ప్రవేశము—లవ-కుశులు పాడుచు)

(అనుబంధము 17)

సీత—(కుమారుల ముద్దిడుకొని) నాయనా! ఇంతసే పెక్కడికి పోయి యుంటిరి ?

లవ—ఎక్కడికి లేదమ్మా! మా తాతగారు వాల్మీకులు మాకు పాఠములఁ జెప్పుచుండిరి. అవియన్నియు నేర్చుకొని వచ్చునప్పటి కింత సేపయినది.

సీత—నాయనా! మీ తాతగారు వాల్మీకు లాశ్రమముననే యున్నారా ?

కుశ—లేరమ్మా! వనమునకుఁ బోయియుండి యిపుడే యాశ్రమమునకు వచ్చిరి.

సీత—అయిన మీరింతవఱకు వారివద్ద పాఠముల నేర్చుకొనుచుంటి మని చెప్పితిరే? అది యసత్యమా ?

లవ—అసత్యమేలనమ్మా ? వా రడవికి పోయియే యుండిరి; మేము పాఠముల నేర్చుకొనుచునే యుంటిమి.

సీత—"వారివద్ద" అని చెప్పితిరే ?

కుశ—వారి యాశ్రమమున మనముండ వారివద్ద కాదా ?

సీత—కుమారా! ఎన్ని విన్నాణములను నేర్చితివిరా!

కుశ—అమ్మా! మన మీయడవిని నేలయుండవలయును ?

సీత—నాయనా! మీరు విద్యాబుద్ధుల నేర్చుకొని యొండైన సదుద్యోగము సంపాదించిన మనము పట్టణము జేరుదుముఁట లెమ్మా.

లవ—తల్లీ! విద్యాబుద్ధుల నేర్చుట యుద్యోగమున కేనా ? ఆ యుద్యోగము మిక్కిలి పరతంత్రముకదా ?

కుశ—అట్టిపరతంత్రుడగువాఁ డేమి లోకోపకారమును జేయును ?

గీ. అవని తన దేహ మొరులకు నమ్ముకొనుచు
నెసఁగు పరతంత్రయుద్యోగ మేలనమ్మ

విద్య కుదర్చేమే ఫలంబేమియమ్మ
అపుడు మన దేశ మభివృద్ధి నందదమ్మ.

సీత—(స్వగతము) ఆహా ! ఏమి యీ పసికూనల మనోదార్ఢ్యము ? (ప్రకాశము) నాయనా ! మంచిగుణము. ఇట్టిగుణములే బాలుర కుండఁదగినవి. ఇవి యెచ్చటినుండి పట్టువడియె ?

కుశ—జననీ ! మొన్న మాగురువులు మాతో రామాయణ కథను బాఠించుచు దానియర్థమునుఁజెప్పిరి. అందులో యెవఁడో రాముఁ డట ! ఎంత గుణవంతుఁడు ! ఎంత సత్యవంతుఁడు !

లవ—ఆయన దేవుఁడని మనగురువు చెప్పలేదా ?

సీత—(కన్నీరునించును.)

కుశ, లవ—అమ్మా యేల ముఖము వంచుకొంటివి ?

(అనుబంధము 18.)

సీత—ఏమియు లేదు నాయనా ! ఊరక కండ్లు మండుచున్నందున కన్నీరు వచ్చినది.

కుశ—చూడుమమ్మా ! వీఁడు మొన్న చిన్న యేనుఁగుపిల్లనుఁ బట్టి యెంతో బాధించుచుండుండెను. అది మిగుల బాధఁ జెందుచుండెను. నే నెంత వలదనినను వినలేదు.

సీత—(లవునితో) ఏమి నాయనా ! నిజమా ? అట్లు చేయరాదు. ఒకరిని బాధింపరాదు.

లవ—అమ్మా! మాయన్న మిక్కిలి పిఱికివాఁడు. నే నా యేనుఁగు నెక్కి కొన్ని దుష్టమృగములఁ జంపితిని. వీఁడు "వలదు; వలదు" అని చెప్పుచుండును. ఇట్టి పిఱికివారున్న దేశమున కేమి ప్రయోజనము? ధైర్యమును దేహబలమును గలిగి, బుద్ధిబలము నుపయోగపరచి, మనము పుట్టిన దేశమునకును, మన ప్రభువునకును సహాయముఁ జేయవలయునుగదా ? అట్టి వారుఁగా కెవరో పనికిమాలినవారు పుట్టుట తల్లుల కడుపుచేటుకదా ?

(అనుబంధము. 19)

సీత—లవకుమారా! నీగుణమును, నీధైర్యమును, మెచ్చతగినవే కాని దుడుకుతనము మాత్రము వలదు.

(ప్రవేశము—ఒక మునిబాలకుఁడు)

ము—బా—అమ్మా! మాగురువులు వాల్మీకులు వచ్చుచున్నారు.
సీత—నాయనగారు వచ్చుచున్నారా? మంచిది.
ము—బా—(నిష్క్రమించును)

(ప్రవేశము—వాల్మీకి.)

(సీతయు లవకుశులును నమస్కరింతురు.)

వాల్మీకి—అమ్మాయీ! క్షేమముగ నున్నదానవా? మునికామినులు నీకుఁ జక్కగ పరిచర్యఁ జేయుచున్నారా? బీదవానియింటికి రమాదేవి వచ్చినట్లే మునికుటీరమునకు నీవు చనుదెంచితివి. తనయా! లోకజననివైన నీకు మా యాశ్రమవృక్షముల నీడ నివసించుట యెంతయు కష్టతరముగా నుండునేమో కదా? తల్లీ! నీవీమునిపల్లె నుండుటచేత నిచ్చటివారందఱు నిదియే విష్ణులోకమని భావించుచున్నారు. ఏదోయొక కారణమున నీకు మాపైఁగల యనుగ్రహభాగ్యము కలిమి కలుముల దేవివైన నీవిచ్చటికి వచ్చితివిగాని లేకున్న మాబోఁటివారికి నీ దర్శనమబ్బునా? మా యాశ్రమమున నీ వెన్నియో కష్టముల నొంది యుందువు. అయినను చింతిల్లకుము. కొలదికాలములోననే నీదుఃఖమున కంత్యము రాఁగలదు. నేను బ్రహ్మలోకమునకు సర్వతోముఖ మహాయజ్ఞమును చూడఁబోవలయు. మఱల శీఘ్రకాలములోననే వత్తును. అంతవఱకును నీ వాశ్రమమునందు ప్రతిదిన వర్తిష్యమాణ ధర్మకార్యముల నెల్లను నా యానతిచే నిర్వర్తించుచుండవలయు. అతిథి పూజలయందు, అభ్యాగతుల నారాధించుటయందును, మునిభార్యలకుఁ జక్కని నేమనం బొనర్చుచుండుము.

సీత—జనకా! అవశ్యము తమయానతి మేఱకు నిర్వర్తించెద. నీ దయావలోకముననేగదా నేనెంత దుస్తర దుఃఖముల పాలైనను జీవించియుండుట ? నీ సాన్నిధ్య మను తెప్పచేతనేగదా నే నీ యాపత్సముద్రముఁ గడచెదననియుండుట తండ్రీ ! తమ జ్ఞానోప దేశ మప్పుడప్పుడు కలుగుచుండుటచేత నేనెంతయుఁ గృతార్థు రాల నగుచుంటిని. మఱల మీ రెప్పుడు వత్తురో యాదినముల లెక్కించుచుందును.

వాల్మీకి—జననీ ! శీఘ్రకాలముననే వత్తునఁటలెమ్మా. కుమారులారా ! నే నుపదేశించిన ధనుర్విద్య నభ్యసించుచు రామాయణకథ నప్పు డప్పుడు మీతల్లి వద్దఁ బాడుచు నేను వచ్చువఱకు నాశ్రమమున కేయుపద్రవమును రాకుండ కాపాడుచుండుఁడు. నే బోయివచ్చెద భద్రము. (నిష్క్రమించును)

సీత—కుమారులారా ! ఏదీ రామాయణకథ మీతాతగా రుపదేశించి రంటిరే కొంచము పాడుఁడు చూతము.

(అనుబంధము 20)

సీత—(కన్నీరునించును.)

లవ—అమ్మా ! అమ్మా ! ఏమట్లున్నావు? ఈకథ నీకు బాగుగ లేదా? ఏల కన్నీరు నించెదవు ?

సీత—ఏమియులేదు నాయనా ?

లవ—అమ్మా! మాగురువులు చెప్పిన రామాయణములో "సీతాదేవి" యనియున్నదే; ఆమె యెవ్వరో రామునిభార్యయఁట ? ఆమెకు నీ పేరు పెట్టియున్నారు చూడమ్మా !

సీత—ఔను నాయనా ! ఆమెయు నావలెనే యొక నిర్భాగ్యురాలు.

కుశ—అదేమమ్మా అట్లనెదవు? ఆసీతాదేవి కావలసిన నిర్భాగ్యురాలు కానిమ్మా. నీవే లయ్యెదవు ? నీ కుమారులము మేము లేమా ? ఈమూడులోకముల నొక్కనిమిషములో జయించి, నీ యనుగ్రహ మొక్కటియున్న. నిన్ను చక్రవర్తినిగాఁజేయుమా? ఇంకొక్కతూరి

యిట్టిమాట లాడకుము. అమ్మా! మఱచితిం ఆ కథలో రాముఁడట! దేవుఁడట! విశ్వామిత్రుని శిష్యుఁడట! తనభార్య నెవ్వరో యెత్తు కొనిపోయియుండ కోతులను బంపి, వెదకించి, సముద్రము దాఁటి యెన్నియో దినములు కష్టపడి, పాప మాపతివ్రతను తెచ్చినాఁడట చూడమ్మా! ఆయన దేవుఁడైన కాని, ఆయనకు ధనుర్విద్య బాగుగా వచ్చినట్లులేదు. లేకున్న శబ్దభేది బాణములను, నామభేద్యాస్త్ర ములను బ్రయోగించిన నవియే యా రావణుని దునిమి తెచ్చి మన యెదుటఁ బడవేయవా? ఆసీతాదేవినిఁ దోడ్తెచ్చి మనయొద్ద విడువవా?

లవ—ఆబాణములు వాని గురువునకె రావు. వానికెట్లు వచ్చును?

సీత—కుమారులారా! అట్లు పెద్దవారిని దూషింపరాదు. మహాపాత కము. ఇంతకును ఆయన మనదేశమునకు రాజు, మీకు తండ్రితో సమానుఁడు.

లవ—ఆయనయేనా రాజు? మాతండ్రి కాఁడా? కాకున్న మేము చేసెదము.

కుశ—అమ్మా! మాతండ్రి యెక్కడనున్నాఁడు?

(లోపల 'జానకీదేవీ' అని శబ్దము.)

సీత—అదిగో? న న్నెవ్వరో పిలుచుచున్నారు. నేను పోయివచ్చెదను. కొంచెము నిలిచి మీరును రండు. (నిష్క్రమము)

[వెంటనే లవకుశులును నిష్క్రమింతురు.] (యవనికపడును.)

---

## తృతీయాంకము—పంచమరంగము.

అయోధ్యాపురము—రాజనగరు.

[రాముఁడు శయనించియుండును. లక్ష్మణ శత్రుఘ్నులు ప్రక్కన నుపవేశించి యుందురు.]

శ్రీరామ—ఆహా! ఈపురి సమస్త ప్రాణులున్నను నవియున్నియు మాజానకివెంట పోయిన ట్లీనగరమంతయు నాకన్నులకుఁ బాడై

తోఁచుచున్నదిగదా ? సీతా! అలికులాలకవాౕితా! పుట్టినప్పటినుండి పుణ్యసాధ్వీమణియగు నిన్ను హింసలఁబెట్టి యిపుడు నీవు భూమిపైనుండరాదని తలఁచి నట్టడవిని ఘోర మృగముల వాౕతవైచితిని గదా ? నీపాలిటి పాపదేవతనై నీవెంటనంటి నిన్ను హింసించుటకు బ్రహ్మ నన్ను సృజించియున్నాఁడు. అయ్యో ! దుర్గంధకూపముఁ బోలె, శూలభూమిఁబోలె, నరకలోకముఁబోలె నున్న యీ పురి నెట్లు చరించి, జీవించి, ప్రాణముల భరియించువాఁడ ?

సీ. నిండుగర్భిణి కాన మండునగ్నిలోఁ ద్రోసి
యేమని జగతి చరించు వాఁడ !
అబలయే, సాధ్వియే యనక నమ్మినభామ
నడుకాననవైచి యెట్లడరువాఁడ !
భోగంబు, భాగ్యంబుఁ భామిని, దేశంబు
కోశంబు నింకెందుఁ గూర్చువాఁడ !
తపియించి కృశియించి ఖేదంపు విషము నక
దహియింప యింకెట్లు తాళువాఁడ !
గీ. అకట నాభాగ్యఫలరాసి నటవిఁదోలి
నరకకూపముఁబోలు నీధరణి నెట్లు
కాంచువాఁడ ప్రబోధంబు కాంచువాఁడ
ఎట్టు లసువుల మేన భరించువాఁడ.

లక్ష్మణా! అయిన సీతజీవించియున్నదని నీకు నమ్మకము కలుగదా ?

లక్ష్మణ—దేవా! గర్భభారమున నలసములై, భవద్వియోగ గర్భభారమున నత్యలసములై; అపనిందాజనిత శోకగర్భభారమున నత్యలసతరములై, నీయట్టి విజ్ఞాన శిఖామణికైనతము తన్ను సందేహించెనుగదా యను తాపమున నత్యలసతమములైయున్న శరీర, ప్రాణ మానసజీవము లాతల్లికి తెలియక మితిమీరి యెందేగెనో తెలియకుండ బోలును. అయ్యో! నీవలనగదా యింత యనర్థము గలిగె ?

రఘుకులముపాలిటి యదృష్టదేవతయే యీనాటికి మముఁ బాసెఁ గదా? ఆతురతభావమున యుక్తాయుక్తముల విచారింపవైతివి. ఈ సమస్త పాపకార్యముల భారమంతయు మూటఁగట్టి నాతలపైఁ బెట్టితివి. ఇపుడు వగచినఁ బ్రయోజనమేమి ? అయ్యో ! ఆదేవి బాష్పజలపూరిత నయనము లింకను శూలములై నన్ను బాధించుచునే యున్నవి.

సీ. అనురాగపూరంబు నలరించె నేకనుల్
దశరథునోడలై తనరునాఁడు
భయభక్తి రసముల వరగించె నేకనుల్
పురిబాసియడవికిఁ బోవునాఁడు
ప్రళయాగ్ని కీలలై రావణు దహియించె
నేకనుల్ లంకకు నేగునాఁడు
కరుణాసుధావృష్టి కరువలి సుతు నించె
నేకనుల్ ముద్రిక నిచ్చునాఁడు
గీ. కుశలమిడు నేకనుల్ విభుం గూడునాఁడు
అట్టి కన్నులు బాష్పధారాళి మునిఁగి
నిఖిలలోకంబులడర మున్నీటముంచె
వినకులేశ్వర ! యేమందు విధికృతంబు.

(శ్రీ)రామ—లక్ష్మణా ! నీవెంతదూరినను తక్కువయే యగు సుమా ! విధిలేక లోకాపవాదమునఁ బడుటకంటె మృతియే మేలని వెనుదీయక నా ప్రాణలక్ష్మిని, నాయర్ధాంగలక్ష్మినివిడచితిగాక యూరక పరిహాసమునకు విడచితినా ?

శత్రుఘ్న—అన్నా ! అట్టి యపనిందకొఱకై యట్టి ఘోరకార్యముఁ జేయవలయునా ? ఈకార్య మాచరించిన మాత్రమిదియొక యపనింద కాదా? అంత విధిలేకున్న వేరుభవనమున నామెనుంచి ప్రసవించిన వెనుక బంధువుల యింటికిఁ బంపియుండరాదా? ఏల యిట్టి యవాచ్య, పుత్రవంశఘాతుక, క్రూర కార్యమున కొడిగట్టవలయు?

శ్రీరామ—శతృఘ్నా! నే నంత యవిచారమున నీకార్య మొసర్చితి ననుకొంటివా ? ఈగ్రామమున సీత యున్నంతకాలము, జనులు మెచ్చుటకుగాను రాముఁడు సీతను వేఱుగా నుంచినాఁడుకాని యంతరమందు ప్రేమను వదలఁడయ్యె నను నపవాదము వృద్ధి యగునుగాని తక్కువ కాదు. మరియు బంధువులవద్దకుఁ బంపిన కులమువాసివన్నెలే చెడిపోవుకదా?

లక్ష్మణ—అట్లని నిరపరాధియగు సూర్యవంశపు పెద్దకోడలిని, నిండు చూలాలిని నడవులదోసి దిక్కులేక చంపెదవే ? ఈధర్మ మద్భుతముగా నున్నది.

శ్రీరామ—లక్ష్మణా ! ఇంత విచారింపవైతివిగదా ? ఆజానకి త్రిలోకపావని యనుట నాకించుకంతయు సందియము లేదు. ఆ సాధ్వీమణి నిష్కల్మషమానస యనుటయుఁ కొందఱి కెవ్వరికో దుష్టులకుఁ దోపదుఁ గాక సకల ప్రపంచమునకుఁ దెలియకమానునే ? అట్టి పూత చారిత్రను నేను ఘోర గహనములఁ దోలుటచే జను లెంతయో కటకటపడి ఆ యపవాదమూలమును నాశన మొనర్చి వారికి సైతము పశ్చాత్తాపముఁ గలిగించి యామె సత్కీర్తిని పూర్వాధికముగా జగమున వెల్లడిచేయుదురు. అందువలన నేనును నామూలమున రఘుకులమును, ఆజానకియు ముక్తకళంకులమై జగత్ప్రశంసనీయస్థితి నొందుదు మనుకారణముచే నిట్లు చేయఁ గడగితిగాక యిది నా మృత్యుదేవతా మహోత్సవ సూచకమని నే నెఱుంగజాలకపోతినా ?

శత్రుఘ్న—దేవా! ఇట్టి విషమపరీక్ష చేయుటలో యమ్మానవతీమణి, ఆ సుకుమారలతాంగి, ఆదేవదేవి యెుడువిధమై యుండిన నెట్లని తలపవైతివిగదా ?

శ్రీరామ—శతృఘ్నా! లక్ష్మణా! లోకపావనమై, లోకాతీతమహిమోపేతమై, లోకాలోక సన్నుతమై యొప్పు రఘుకుల మన్యాయముగ వశించుననుకొంటిరా ? నావట్టపుదేవేరి, నాధర్మసాక్షిణి, నాతపః

ఫలరాశి యన్యాయముగ నాశనమొందునని నాకెన్నటికినిఁ దోఁపదు. అట్లు కాకున్న నేఁడు లోకమున ధర్మదేవతయే నశించె నను కొనుఁడు. సూర్యోదయ సూర్యాస్తమయములే కలుగ వను కొనుఁడు ఇంక నన్నివిషయములనఁ బ్రశ్నింపకుఁడు.

లక్ష్మణ—దేవా ! లోకారాధ్యుఁడవైన నీయాశయము మేము తెలియఁజాలుదుమే ? నీవనినట్లులనే సర్వ శుభములు కలుగుఁగాక ! మా జానకీదేవి సుఖప్రసూతయై సుఖముగ నుండుగాత ! ఇప్పుడైన లోకాపవాదము తొలఁగినదిగదా ? పౌరులందఱు నాచాకలివానిని వెదకిరిగాని వాఁడు దొరకఁడయ్యె. వాని పేరును, నూరును మన యూర లేవఁట. వాఁడెక్కడనుంచివచ్చెనో, యెక్కడికిఁబోయెనో యద్భుతముగా నున్నది. మీకు వచించిన భద్రుఁడు సైతము నాటి నుండి మనకుఁ గనుపింపఁడయ్యె. ఇదియంతయు వాని మాయయే యని పౌరులందఱు వానికై వెదకుచున్నారు. నీ యిష్టార్థసిద్ధి యయ్యెఁగదా ? ఇంకనైన వెదకించి పిలిపింపుమా మాసీతాజనని.

శ్రీరామ—గానిమ్ము ! ఇంకను కొంతకాలమేగవలయు.

లక్ష్మణ—ఇఁక తమకు యజ్ఞదీక్ష ప్రారంభమగును. మొన్న వసిష్ఠు లశ్వమేధయజ్ఞమును చేయుమని మీకానతివ్వలేదా ?

శ్రీరామ—లక్ష్మణా! నిజము. ఆ రావణ సంహార జనిత బ్రహ్మహత్యా దోషమును బాపికొనుటకై యశ్వమేధము చేయవలసివచ్చినది. రేపు బృహస్పతివారమే దీక్షాబద్ధుడ కావలయు. అశ్వమువెంట మన శత్రుఘ్నుఁడే యరుగవలయును. మఱచితిని. మీరు భరతునితో వచింపుడు యజ్ఞమునకుఁ దగు సన్నాహములఁ జేయుమని. ఇక మీరుపొండు.

లక్ష్మణ, శత్రుఘ్న—భాగ్యము. (నిష్క్రమింతురు)

శ్రీరామ—అకటా ! నేనెట్టి కఠిన కార్యమును జేసితిని ? నట్టడవుల పాలుచేయుకాలమున, నా యబల, యాశిరీష కోమలాంగి, యా

కోమలహృదయ తెరతెరలై పర్వతోపమానములై వచ్చుశోక విష కీలల నట్టి హృదయము పగిలి చచ్చెనో, లేక పడిపడి పరతెంచు నడవి మృగంబుల వాతఁబడియెనో ? కని చూడరాని కన్నవారి యపనింద వాక్యముల నాలించి, విసిగి ప్రాణములఁ వీడుటకుఁ దెగించి గంగానదిలోఁ బడియెనో ! లేదేని నిండుగర్భవతి యగు నా పతివ్రతాతిలకమును ధర్మదేవతయో, మునులో రక్షించిరో తెలియదుకదా ? ప్రేయసీ—జానకీ !!!

సీ. జననింద నినుఁజెంద మనమందు కడుగుంది
జనకనందని యెంత వసటఁబడితో
వనిఁజేరి నినుఁదూరి ననుదూరి బలమూరి
వేసారి సతియెంత వెతలఁకనితో
కడుజాలి పడితూలి చెడుబాళి వడిఁదోలి
పుడమిపైఁ బడి యెంత పొగలఁ గనితో
బలుచింతఁ గనలేక బలవంతమనలేక
యిలలేక కలికి నీవెందు జనితో

గీ. ప్రాణనాయకి, జానకి, పావకీన
భానుదాయకి, మామక భావమందు
నిలచియును నిట్లుగా రింప వలవ దింక
సుగుణగణజాత యోసీత సూరివినుత.

శా. ఓరామామణి ? చిత్రకూటగిరిలో నొప్పారు పూఁదోటలో
నీరాడన్ నది కేనుబోవ ఘనమా నెయ్యంబునన్ రాఘవా
ఓ రామా ! యని నన్నుఁబిల్చెవె వనిన్ యొక్కింత నేతాళినన్,
గ్రూరారణ్యమునొంది యిప్పుడెటులన్ రోదించితో నుప్రిక్కితో.

మ. అకటా ! కానలో జాహ్నవీతటగతాహారాంచితానోకహా
సుకరారణ్యమృగావళుల్ వనటచే శోకింప నాసాధ్వి జా

నకి మందాకిని యెందుఁజొచ్చెనో, యరణ్యప్రాంతభూమాత ! న
న్నికనైనఁ గొనిపొమ్మటంచు ధర నిర్వేదత్వముం జెందెనో.

అక్కటా! ఈసూర్యుఁడు జానకీపరితాపంబు చూడనేరక నపరాంబుధిఁ జేరుచున్నవాఁడుకదా !

చ. తనకులముద్ధరించుసతి, తన్నుఁ బవిత్రునిఁజేయు భామ, నం
దనునకు కాంతుఁడీర్చు వరతామరసేక్షణ, యాత్మమిత్ర పా
వనకుల పేర్మిపుత్రి, నతి పావని కానలఁ ద్రోసినట్టి పా
పునిఁ గనరాదటంచు రవిపొక్కి పరాంబుధిఁ గ్రుంకె నక్కటా.

అయ్యో! తన మిత్రుఁడై నమిత్రుఁ డస్తంగతుఁడైనను నీపాపిచందురుఁడు పొడుపుకొండపై నుదయించుచున్నవాఁడుకదా !

మ. తనమిత్రుండు తొలంగిపోవ జగముల్ తాపాంధకారంబునన్
మునుగన్ సత్పథమెల్ల కాంతిఁ దొరగన్ ముంజేతులాడించుచున్
ఘనదోషాసతిమెప్పుకాఁడు ద్విజులన్ గారించు పాపుండు నా
వనజాతంబులవైరి చంద్రుఁడకటా ప్రాగద్రిపైఁ దోఁచెడిన్.

సీ. మున్నీటనలరించి మున్నీట నుతయిల్లు
మన్నీట గారించు మిన్నగాదె
చిచ్చుకన్ దొరతలఁజొచ్చి యాచిచ్చుకన్
దొరసాని సవతిపైఁ బరగలేదె
సద్విషంబునబుట్టి సద్విషంబునుగ్రిక్కి
సద్విసరంబార్చి చంపలేదె
జేజేలసామికి జేజేలఁజేసి జే
జేనొజ్జకుం గీడు చేయలేదె

గీ. లోకమెల్లను దుఃఖంబులోన మునుఁగ
సంతసించుట నీకు నైసర్గికంబు
జడుల కెందైన నపకార సరణికలదె
కఠినచిత్తుల కెందైన కరుణఁగలదె.

ఆహా ! ఈ మందమలయానిలయుఁడు సైతము తనపుట్టుక నిల్లైన విచారింపక నన్ను గారించుచున్నాఁడుగదా ?

చ. పరుల మెలంగఁ బుట్టుచు నపారబలంబున వారివంచి పు
ష్కరిణుల పద్మినీవశత గాంచి విచారముఁ జేయఁ హీనుఁడై
యొరులను తాకు దుర్గుణము నొందిన దక్షిణుఁడో ప్రభంజనా !
అరివయి తేల నాకుఁ గన నాపద వేళను శత్రులందఱుక్,

అయ్యో! సర్వభూవలయచక్రవర్తినియగు జనక తనయ ప్రసవమహోత్సవ మరణ్యభూమియందు భల్లూకతరుణులచే నిర్వర్తింపఁబడవలసెనుగా ? దురదృష్టములకెల్ల నిలువగు నాయట్టివానిని చేఁబట్టుటచేత నేఁగదా యాసాధ్వీమణి కిట్టి యెడతెగని యాపదలు కలిగెను ? జనకుఁడు దుస్తరారణ్యములఁ గాపురము చేయుటకై నాకుఁ దన తనయనిచ్చెనా ? అకటా ! అనువ్రత, అనన్యధాజీవన, అధిక తేజో విజ్యోత, అనుపమాన పురంధ్రీపూతఁ గఠిన హింసలఁ బెట్టితి గదా ? అయ్యో ! హింససైతము కాదే ? కంటకములఁ నడుమ వైచి, అపవాద వాక్య శూలములఁ గ్రుచ్చి, నా నిర్దయంశాసన రూపదవానలమును పురిఁగొల్పి నాకఠినతర వాక్య శిలాఫలకములపై మోది, నలచి, విరచి, దహించి, గ్రుచ్చి, హింసించితినిగదా? ఇట్టిపాపుండు లోకమునం దుండఁగలఁడే ? అకటా ! నా కేల నీయయోధ్య ? నా కేల రాజ్యసిరి ? నాకేల రాజ్యభోగములు? నేనునుఁ బోయి నా జీవితేశ్వరి నివసించు కానలకేగి ఆ యనుభవ, మృదుల, పరిశుద్ధ తనూలతచే పవిత్రతరమైన కాననభూమి నను వుల విడిచెదఁగాక, అక్కటక్కటా ! ఆనాఁడు వనవిహారము తరి పలుకరించిన పలుకులే యంత్యభాషణము లాయెఁగా ? ఒక్క మాటైనను నాడితివా ? తరియిట్టిదని వృత్తాంతమైన వచించితినా ? అయ్యయ్యో! ఘోరకిరాతకృత్యమొనర్చిన యపరాధి సైతము ధర్మవిమర్శన కాలమున తన నిర్దోషిత్వమును స్థాపించు సంపూర్ణ స్వాతం

త్ప్రియమున కర్షుఁడై యుండ నాయర్థాంగియగు దౌర్భాగ్యమః కతన కదా, నా వామభాగముననున్న మదేకజీవనయగు, నోరెఱుఁగని యనాథయువతిని నిష్కల్మషమానసను- పరిశుద్ధ చారిత్రను- విషయ మిట్టిదనియైన వచింపక- మోసవిధానమున కంటకారణ్యముల- ఘోర ఘాతుక మృగముల వాతఁ బడవైచితి. అయ్యో! నా నిర్దయాశాసన రూపదవానలము తన్ను నిర్దయించుచున్నను నొక్కమాటయైన ననునాడని సుగుణోపేతయే! మదీయ క్రూరతర శాసన నిర్వాహణమునకై యుపనిందావాత్య హాలాహలము నేని పరమశాంతతమున గ్రోలిన పతివ్రతాతిలకయే. అక్కటకటా- యీ తాపమునకెట్లు తాళుదు? యీ దుఃఖ మెవ్వరితో వచింతు? యీ శోక మెవ్వరితో మొఱవెట్టుదు. యీ తాపము- యీ యంతర్దహన తాపము నెట్లోర్తు? మఱల నీజన్మమున నా దేవదేవిని- నాయర్థాంగలక్ష్మిని నెట్లుగాంతు? జానకీ! నిన్ను కారడవులఁ ద్రోలిన నీ కఠినుఁడు- నీనాథుఁడు- నిజఘోరతరహింసా రూపకిరాత కృత్యమునకుఁ బ్రిదికియే క్షణక్షణమునకును పశ్చాత్తాప మరణతాపముల ననుభవించుచునే యున్నాఁడు. ఆహా! లోకమంతయు జానకీమయము- ఎందుఁజూచిన- యేవస్తువును పరికించినను, భాష్పజలపూరిత నయనయగు నా జీవితేశ్వరి రూపమే- ననుఁజూచుచు- నా దుఃఖమును పరిహసించుచున్నది. జానకీ- జానకీ- నీకు దుర్భరసంతాపమునుఁ గూర్చిన కఠినాత్ముఁడని-నీపగసాధించుటకై నను బాధింప సాగితివా? అయ్యో! యిదియా నన్ను హింసింపసమయము- వలదుడుగుమా యీవిషమపరీక్ష- నేనీసంతాపమును భరింపజాల-వలదు నను బాధింపవలదు- రమ్మా- యీవిషమపరీక్షమాని- నాసంతాపమును చూచుచుండియు మిన్నకుండుట న్యాయమా? నాథుఁడెట్టివాడైనను సతుల భక్తిపూజాసపర్యలకు పాత్రుఁడే యగుగదా? నన్నాదరింపవా? తాపాంధకారమున దరిగానక- శోక పశ్చాత్తాప

బాధితుఁడగు నీనాథుడు నిను వేడికొనుచున్నవాఁడు - అయ్యో - యింకను నాపై కరుణకలుగదా ? మద్వియోగ దుఃఖమొకటి యనుభవించితిగాకఁ నావలె నిమిసనిమిసమునకును దుఃఖ పశ్చాత్తాప వేదనలసైత మనుభవింపవే. అలనాఁడు, లంకలో, నగ్నిగుండముఁ జొచ్చినపుడైన నిందు ప్రేమ - మందహాస భాసుర సుందర వదనారవిందవై నన్ను క్షమించితివే ? యిపుడీ కాఠిన్యము నీకెట్లు పట్టువడియె ? ఏల నాసంతాపము దీర్పరావు. యేల నన్నూరడింపవు- నీఘోరతర కిరాతకృత్యము నీ క్షమాగుణమును సైతము మీరుచున్నదా? ఆహా! తాళఁజాల - జానకీ విరహితమగు నీ ప్రపంచమున జీవింపఁజాల - నాయర్థాంగి - నామనోహారిణి - లేని యీధరణిని యసువుల భరియింపఁ జాల - లోకమంతయు - జానకీ మయమైయున్నను - సంతోష దేవత యెల్లెడల తాండవమాడుచు నన్ను - నాకుమాత్రి మీ ప్రపంచము, జలాశయముబాసిన మీన మునకుఁబోలె దుర్భరమైయున్నది. జానకీ విరహితయగు నీభూదేవి నన్ను భరింపఁజాలకున్నది. ఆహా! అదే - నామనోహారిణి మందహాసమున నన్నాహ్వానించుచున్నది. ఆహా ! నన్ను క్షమించితివా ? నాకిరాతకృత్యమును మనసార క్షమించితి ననుకున్నదానవా? ఆహా! ఏమి నీక్షమాగుణము - ఏమి నీపాతివ్రత్యమహిమ - ప్రియసీ - ప్రియసీ - పోవకుము - పోవకుము - యిదే వచ్చితి - అయ్యో ! పోయితివా ! వలదు - జానకీ - జానకీ జానకీ - పోవలదు-రమ్ము-ఆహా-వచ్చితివా ! రమ్ము - నిన్ను విడువను- యింకెందుపోవఁగలవు - ఆహా - పోయె - మరల నామనోహారిణిపోయె - జానకీ- జానకీ- తా - ప - ము, బా - ధ, రమ్ము - హా, తా - ళఁ - జా - ల, జా - నకీ, జా-న-కీ. [మూర్ఛిల్లును.]

(యవనిక పడును.)

---

# లవ-కుశ నాటకము.

## చతుర్థాంకము.

చతుర్థాంకము—ప్రథమరంగము.
అరణ్యప్రదేశము.
[ప్రవేశము: లవ-కుశులు]

కుశ—తమ్ముఁడా! చూచితివా? అదిగో! ఖడ్గమృగమొక్కటి చను దెంచుచున్నది. పోయి దానిని మొదట ఖండితము. ఇట్టి మృగము లాశ్రమవాసులను మిక్కిలి బాధించును.

లవ—వలదురా! దీనినిఁబట్టి యింటికిఁ దీసికొనిపోయి మొన్న మనము సింహమును వేసితిమే యాబోనులో వేయుదము.

(ప్రవేశము: ఖడ్గమృగము)

కుశ—అట్లే కానిమ్ము. (అని దానినిఁ బట్టుకొందురు.)

లవ—అన్నా! ఇక్కడ చూచితివా? దీని శరీరమున బాణము నాటి యున్నది. పాప మెవ్వరో దీనిమేన శరమును వేసియున్నారే? (అని బాణమును దీసివైతురు.)

(ప్రవేశము: మునికామినులు.)

1 స్త్రీ—(జనాంతికముగా) ఏమాశ్చర్యమిది? చూచితివే! వీరుఖడ్గ మృగమునుబట్టి యున్నారు? (ప్రకాశముగ) బాలకులారా! ఇదియా దుడుకుతనమునకు వేళ? ఇదియేమి జింకపిల్ల యనుకొం టిరా? ఇది ఖడ్గమృగము. దీనిని మొట్టమొదట విడువుఁడు. ఇది కొమ్మునఁ బొడిచిన మిక్కిలి యపాయకరము.

2 స్త్రీ—మీ రెప్పుడు నిట్టి తుందుడుకులే చేయుచున్నారు. తల్లి దండింపదు. మిక్కిలి గోమునఁ బెంచుచున్నది. వాల్మీకులు చూచి నవ్వుచుందురు. మొదట దానిని విడువుఁడు.

లవ—మంచిబుద్ధిశాలినులు. మీకేమి విద్యయా బుద్ధియా ? మీరు విద్యనేర్చుకొనియున్న నిట్లన్నదునుఁ జెప్పుచుండరు. ఇట్టి దుష్ట మృగములను మన నివ్వరాదు. ఇది మమ్మేమియుఁ జేయఁజాలదు. కావున దీనిని మేము విడువము. స్త్రీలకు విద్యనేర్పియుండిన వారు తమబాలురకు ధైర్యమును నేర్పి వారి కీర్తిని వృద్ధి చేయుచుందురు. మన స్త్రీలకు "విద్యకూడదు విద్యకూడ"దని మనవారు పశువులుగాఁ జేసిరి. అందువల్ల దేశ మెన్నఁటికిని వృద్ధినొందఁ జాలదు.

చ. తరుణుల నన్యభావత నుదారమనీష నుహృద్యవిద్యలన్
ధరణివివేకమున్, విపులధైర్యము, దేశమహోన్నతీహయున్
తిరముగనొందఁ భర్తనుఖదీప్తి వెలుంగదె సాయమబ్బదే
సురుచిర దేశవృద్ధియును చొప్పడదే ఘనధైర్యమబ్బదే.

సీ. గురుశిక్షితానంత గుణపుత్రిబోధన
ప్రియమాన మానసోపేత మాత
దేశసేవాబోధ దీప్తహీనకుపుత్రి
ఘన దేశభక్తిసంజనని జనని !
రణకాందిశీక పుత్రాంచిత ధైర్యసం
ధాన సద్భావమతల్లి తల్లి
రాజభక్తిప్రబోధ రాజితగుణమాన్య
కొమరు తా నొనరించు కొమ్మయమ్మ

గీ. ధరణి సాహస, సత్కృపా, దాన, ధర్మ
సరసవిద్యోపకారతాసన్వసమత
లరయబోధించి మమతల నారఁజేయు
అఖిల సన్మాన్య గుణధన్య యానుకాంత.

కుశ—అందులో బాపకామినులకు నింటిలోని గోడయే దయ్యముగాఁ గనుపించును. ఇంత తెలిసికొనఁజాలరా ? ఈమృగము మమ్మేమైనఁ

జేయజాలియుండియు నిట్లు మాచేఁ జిక్కియుండునా? ఊరక మాట్లాడక పోం డావల.

1. స్త్రీ—ఏమి పిడుగులురా మీరు? మంచితండ్రికిఁ బుట్టితిరి.

[ప్రవేశము—జనకుడు శీఘ్రయానమున]

(అనుబంధము 21)

జనక—(బాణమును సంధించి) మునిబాలకులారా! దారి విడువుఁడు. ఈఘోరమృగము మిమ్ముల బాధించును నే నిప్పుడే దీనిని బాణమున ఖండించెదను. తొలఁగిపొండు.

కుశ—ఎవరయ్యా నీవు? వైదికపుమాట లాడుచున్నావు? దారియేమి? విడుచుటయేమి? మొదట మీయూరిదారిఁబట్టుము.

గీ. అమిత విక్రమమార్తాండు లగుచు భూమి
కంటకావళి బరిమార్చు ఘనులయెదుట!
శ్రాద్ధభోజనవికటహాసంబుఁ జేయు
వైదికులఁబోలె మాటాడ వలవ దింక.

లవ—ఓహో! చచ్చినమృగములను వేటాడెడి శూరుఁడవా నీవు? భళి. వీరుఁడన్న నీవే!

జనక—(స్వగతము) ఆహా! వీ రెంత నిర్భయముగా మాటలాడు చున్నారు? ఈ పసికూనల నెట్లిల నొంటరిగాఁ దలిదండ్రుల లరణ్యమున విడిచియుందురు? ఔరా! పసిపాప తేజ మెల్లెడల వ్యాపించి వాసిఁగాంచి నాకద్భుతము జనింపజేయుచున్నదిగదా? (ప్రకాశము) బాలకులారా! మేము క్షత్రియులము; కావున దీనిని సంహరింపనేవలయు. ఇది మిక్కిలి భయంకరమగు మృగము. నాబాణముచేత తొలుతనే యర్థము చచ్చినందున మీరు దగ్గర నున్నను మిమ్ముల బాధింపలేదు. ఇంక నైనను తెలిసెనా?

లవ—అయ్యా! మేమును క్షత్రియులమే. ఇది మాచేఁ జిక్కినది. ఇది యేమియు నీచేఁ జావలేదు. ఊరక గాజులవానిమర్యాద యేలచేసి

కొందురు ? మేము దీనికోరలఁబట్టి నిలిపితిమి. ఇదిగో చూడుము. (అని కొంచెము కోరను విడుతురు. ఖడ్గమృగము పరువెత్త నుంకించును.)

జనక—చూచితిరా పోవుచున్నది. కనుకనే మీ రావల తొలఁగిపొండని నేను జెప్పుచున్నాను. ఇది నావలని భయమున మిమ్మేమియుఁ జేయఁజాలకున్నది. నేను కొంచము దీనిని విడిచిపోతినా తప్పక మీకు ముప్పు కలుగును.

కుశ—మంచి నేర్పరివయ్యా నీవు. నీభయముననే యిది యిట్లు నిలచినదిగా ? ఇది మాయది దీనిని నీయస్త్రము లేమియు చేయఁజాలవు. పొమ్మూరక.

జనక—మీ రేమి దుష్టులుగానున్నారే ! మునికామినులారా ! మీరిక్కడినుండి యెత్తుకొనిపొండు వీరిని.

లవ—ఏమయ్యా ! కొంచెము నోరుబిగియఁబట్టి మాట్లాడుము. ఇది మాచే రక్షింపఁబడినది. 'త్రాహి' యన్నవారినిఁ దప్పింపజాలము. నీవుకాదా ముక్కంటి వచ్చినను నావని కానేరదు.

2 స్త్రీ—వీ రేమి దుర్మార్గులే ? వీరితల్లితోఁ జెప్పెదము రమ్మా.

(నిష్క్రమము.)

జనక—ఇదిగో! బాణమును సంధించెదను. చెడిపోయెదరు సుమా ! (అని బాణమును వేయును.)

కుశ—(బాణమును దెగవేసి) నీబాణమెక్కడ నున్నదో చూడుము.

జనక—(ముందుకుపోయి యాశ్చర్యమున యోజించుచుండును.)

లవ—అన్నా ! దీనిని నీవు తీసికొనిపొమ్మా. నే నీయనతోఁ గావలసినంత మాట్లాడి వచ్చెదను.

(కుశకుమారుఁడు మృగముతో నిష్క్రమించును.)

లవ—(ముందరికి వచ్చును.)

జనక—(కోపముతోఁజూచును.)

లవ—ఏమయ్యా! మిఱ్ఱింగెదవా అట్లు చూచుచున్నావు? నన్నేమి చూచెదవు? నీమృగ మెక్కడనున్నదో చూడుము.

జనక—ఎక్కడ?

లవ—ఇక్కడ; ఇక్కడకా దక్కడ; అక్కడను కా దిక్కడ. (అనిసలు దిక్కులనుఁజూపి కంటిలోనిపాపను చూపి పరుగెత్తిపోవును.)

జనక—ఆహా! ఈమూరాకారు లెవ్వరై యుందురు? వీరి యత్త్రైపుణ్యమేమి? వీరిరూపవైఖరి యేమి? వీరిమాటలేమి? భూమి నవతరించిన కంతుజయంతులవలె నున్నారుగదా? మోముపోలిక చూడ, నిడువాల్కన్నుఁగవలఁ బరీక్షింప, విశాల ఫాలతలముల నాలోచింప, నిడుదయురంబులఁ దిలకింప, నే నెక్కడనో చూచి నట్లున్నది. మోమున మాసీతాదేవిపోలిక యున్నది. ఆహా! ఒక్కటి జ్ఞాపకమునకు వచ్చుచున్నది. ఆదేవదేవి కారడవుల విడువఁబడు నప్పుడు గర్భవతియై యుండెనని వింటిని. ఈ వీరమొలకలు ఆమె కనినకుమారకులై యుందురా? అయ్యో! నా కెట్టిభ్రాంతి? ఎందో కీకారణ్యమున విడువఁబడిన యానుకుమార కోమలాంగి కూ్రర మృగములచేతనో రాక్షసులచేతనో భక్షింపఁబడి యుండ నాకెక్కడిసీతాదేవి? ఎక్కడికుమారులు? ఔరా! అదేలజీవించి యుండరాదు? ఆపరాదేవిని, ఆభువనమాతను, ఆసర్వశక్తిస్వరూపిణిని, మృగములు, సర్వవసదేవతలు సేవించి, దరిఁజేర్చి యుండ వలయుఁగాక బాధింపజాలునే? అది అటుండ చేతిలోని మాణిక్యమును గ్రద్ద తన్నుకపోయినట్లు నన్ను పిచ్చివానినిఁ జేసి యా మృగము నెత్తుకొనిపోయి తమ ప్రతిజ్ఞనే బాలకులు కాపాడుకొనిరిగా! వీరత్యద్భుత పరాక్రమవంతులని తోఁచుచున్నది. అయినను వారియందు నా కనుమానము మానదయ్యో. అయ్యో! నాకట్టి పుణ్యము గలుగునా? మరల నాకుమారిని, నాసీతాదేవిని కనులారఁ గాంచుభాగ్యము నాకు కల్గునే?

సీ॰ సవనావనీజాత పవమాన సుత నూత
భువనైకవిఖ్యాతపూత సీత
శ్రితజాలనుతగాత్రి ద్విజపూత గాయత్రి
సోమార్కవర నేత్రి భూమిపుత్రి
ఓంకారవరధామ యురులోక ధృతికామ
రాక్షసకులభీమ రామభామ !
రుద్రాదిసురశక్తి ముద్రాదిచిచ్ఛక్తి
భద్రాదిగుణరామ భద్రశక్తి
గీ. యోగసువిలోల, భ్రూయుగ యోగలోల
మంత్రిభాస్వరతారక తంత్రిజాల
రాఘవానందలోల, చంద్రాభఫాల
భవ్యశ్రీబాల నాబాల ఫాలలేదె.

ఉ. కందునొ క్రందునెమ్మదిని కందునణంచెడు నిందుభాచ యా
నందము నొందుమోమును, సనందననారద యోగిబృందముల్
విందుగఁజూచు నిందిర, కవీడితమందిరఁ గాంచుభాగ్యమే
నొందఁగలేనొ ? నన్నునటు నొందఁగలేవొకొ పూర్వపుణ్యముల్.
(నిష్క్రమము.)



చతుర్థాంకము—ద్వితీయరంగము.
స్థలము: వాల్మీకాశ్రమ ప్రాంతారణ్యభూమి.
[ ప్రవేశము: లవకుమారుఁడు, మునిబాలకులు. ]
(అనుబంధము 2క)

లవ—మునిబాలకులారా ! ఇఁక మన మాటలను చాలించి యేమృగ
ములు భూములయందుండెడి పైరులను ధ్వంసము చేయుచుండునో,
యేక్రూరమృగములు బాటసారులను తాపసులను నెల్లప్పుడును
బాధించుచుండునో, యేఘాతుకమృగము లాశ్రమములందలి హరి

ణాదిమృగముల నెల్ల వేళల భక్షించుచుండునో, అట్టి శార్దూలాది మృగములను గొంతవఱకు సంహరింతము రండు.

1. బాలక—సరి బాగుగనున్నదిరా! ఊరక బ్రతికినన్నా భృప్పతిని యైన బ్రిదుకక పులుల నోటిలోఁ యెల్గులనోటిలోఁ బడుమంటివా? నీకు రొమ్ము పొగరున్నట్లున్నది. ఇది బాగు కాదురా.

లవ—ఇందుచే మనల నందరు పరిహసింతురా? దైవ మనుగ్రహించిన ధైర్యసాహస విజ్ఞాన సంపదలను లోకోపకారమునకై యుపయోగింపక కేవలోదరంభరత్వమాత్రమున మనదేశమువారు మోతుమబ్బి నట్లు సంతసింతురు.

మ. పరులిండ్లన్ దిరిపెంబులెత్తి, ధనులన్ బ్రార్థించి ప్రార్థించి, స్తో
మరులౌ వారల కేల ధైర్యము? లసన్మానంబు దేశోపకా
రరమావృద్ధియు, దుష్టశిక్షణము రారంజించు శౌర్యంబు ధీ
వరులై గాథలఁ జెప్పుచుండుఁ డిఁక నీవాక్యంబులన్ బల్కకన్.

2. బాలక—హాసనమున కియ్యకొని ప్రాణముల తెగింపకున్నవారు మాత్రము దేశోపకారమొనర్పజాలరు ఏమిరా? సీతాదేవికుమారుఁడ వని మితిమీరి మాటలాడజొచ్చితివి?

మ. క్రతుజాలంబుల, నిత్యకర్మల, తపఃక్లాంతిన్ జలారంభతన్
వ్రతనైమిత్తికదీక్షలన్, భువన భద్రానంద కాంక్షోద్యులై
సతతంబాత్మ పరోపకార రతులౌ సర్వంసహాదేవులన్
నుతి సల్పందగు, నిందలాడదగునే నూత్నంబుగా బాలకా.

లవ—అట్లయిన నావెంటరండు. నేనే పులులను యెల్గులను కుప్పలు కుప్పలుగాఁ గూల్చెదను. మీరును కొంచెము దేహబలమును సాధింపుఁడు. అది సకలకార్యములకు మూలమగును. మీ బ్రాహ్మణులలో పరశురాముఁడు చూడుఁ డెంత ప్రసిద్ధికెక్కెనో?

చ. ధరణి జనించిందునకు నుదారబలంబున, సాహసంబునన్
నిరుపమకీర్తినొందె, జననీజనకాదులు సంతసిల్లఁగాఁ

బరిగెడువాని పుట్టక యె భవ్యపుఁబుట్టుక, కాకయుండిన
తరువులు పుట్టవే ? క్రిములతండము పుట్టదె వ్యర్థజీవమై ?

2. బాలక—నీకేమో పొగరు తలకెక్కుచున్నది. మాకు దేహబల మెందుకు ? బుద్ధిబలమున్నఁజాలును.

సీ. అసమానవిక్రమ లసమానబలినేత
పొట్టిబావనిచేతఁ గట్టువడఁడె
శంకరుమెప్పించి శంకరువరమొంది
భస్మాసురుఁడు తాను భస్మిగాఁడె
నరసింహములచావ నెరయక నరసింహు
చే హిరణ్యుఁడు మృతిఁజెందలేదె
మాధవుయుక్తికి మారాడనేరక
మధుకైటభులు భూమి మ్రందలేదె
గీ. దానవావళి మోహినీతరుణిరూప
ధారియౌ హరిచే సుధాధారఁబాసి
చెడరె సద్బుద్ధిబలమున్న శ్రేయమబ్బు
బాహుబలమేల కొల్పవే బపలకును.

లవ—బుద్ధిబలమునకుఁదోడు దేహబల మవశ్య ముండవలయుఁగదా ? అప్పుడు దేశము సారవంతమగును.

సీ. ధీశక్తియుక్తికి దేహశక్తియునున్న
పౌరుషం బప్పుడు పరగునయ్య
పౌరుషహీనమౌ పురుషజన్మము భూమి
భారమై సువిచారదూరమయ్య
దేహంబునిర్గత దీపంబు నగుడుఁ దా
శేముషియభివృద్ధిఁ జెందదయ్య
ప్రభుభక్తినిండార బలశాలి రణమున
రాజసాహాయత గ్రాలునయ్య

గీ. బలములేకిటు యబలులై చెలఁగుచుండ
పరులు మమ్ముల నిర్లక్షభావమునను
గాంచ దేశంబు నభివృద్ధిఁ గాంచదయ్య
అంగబలమున్న నంతయుఁ నమరునయ్య.

(లోపల సైనికుల కోలాహలము)

1. బాలక—తాళుఁడు! అందేమో శబ్దమగుచున్నది.
(అందఱునుఁ జూచుచుందురు. ప్రవేశము సవనాశ్వము)

2. బాలక—చూడరా! చూడరా! ఇదియెంత మంచిగుఱ్ఱము. లవ కుమార! నీవు వేటాడఁ బోవలయునంటివే? దానికిది మంచి యుప యోగకారియగును దీని నెక్కి వేటాడబోమ్ము.

లవ—ఔను. బాగుగానున్నది (అని యశ్వమును బట్టును.)

3. బాలక—దీనిముఖమున నేదియో యొకపత్రికయు. దానియందు గొన్ని శుభాక్షరములును వెలయుచున్నవి. అవియేమో చూడుఁడు.

లవ—(ఫాలపట్టమునందలి పత్రికనుదీసి చదువును.)

శా. వీరాగ్రేసరుఁ డశ్వమేధహయము ద్వేలంబుగా నంపె, నా
శ్రీరాముం డిటు రావణాంతకుఁడు, రక్షింపఁగ వడిఁగ వచ్చె, నా
ధీరోత్తంసుఁ డనేకవాహినితో శత్రుఘ్నుండు నీధారుణిన్;
శూరుల్ గల్గిన ధైర్యలక్ష్మి హాయ మాను ప్రౌఢిమన్ బట్టుడీ.

1. బాలక—అయిన వలదురా యిది పోవనీ. ఏమో బలమున్నవారు పట్టవలయునఁట! శత్రుఘ్నుఁడు వెంటవచ్చువాఁడఁట! ఇదియజ్ఞపు గుఱ్ఱమఁట! వలదబ్బా! దీనిజోలి మన కేల?

లవ—అయిన మిక్కిలి మేలయ్యె నేఁబట్టెద నీయశ్వమును రాముఁడు యజ్ఞముచేయువాఁడఁట! శత్రుఘ్నుఁడు శూరుఁడట! అయిననేమి శూరుఁడైనఁగానిమ్ము. వీరుఁడైనగానిమ్ము. దీనిని గట్టిపెట్టి నేఁ బరీక్షించెద వారిశూరత్వమును. (అని గుఱ్ఱము నొకచెట్టునకుఁ గట్టి వేయును.)

2. బాలక—మృత్యువును వెంటబెట్టుకొని తిరిగినట్లు నీవెంట వచ్చి వది మాకే బుద్ధిచాలదు. ఇంకొకతూరి నేఁజెప్పెద వినుము. మన కేల యీయధిక ప్రసంగము ; ఊరక యాశ్రమమునకు బోవుదము రమ్ము.

3. బాలక—నీకేమి పైత్యమా? మహాసైన్య మెక్కడ? యుద్ధమెక్కడ? చేయుటనఁగ నెక్కడ? చాలును రమ్ము పోదము.

(ప్రవేశము:—సైనికులు, సేనాధిపతి)

సేనాధి—అయ్యా! మునికుమారా! ఈయశ్వమనఁగ నేమనకొంటివి?

లవ—గుఱ్ఱ మనకొంటిని.

సేనాధి—దీని నేమిచేయ నెంచితివి?

లవ—కట్టివేయ నెంచితిని.

సేనాధి—ఇవి వట్టిమాటలు కావుసుమా?

లవ—వట్టిమాటలు కాకున్న పచ్చిమాటలు కానీ.

సేనాధి—(సైనికులఁజూపి) వీరి నేమని యనుకొన్నావు?

లవ—నాబాణములచే నెన్నఁడో చచ్చినవీనుగ లనుకొన్నాను.

సేనాధి—యీ గుఱ్ఱము నెట్లు కట్టితివయ్యా ?

లవ—త్రాటితోనయ్యా

సేనాధి—నీవు బాలుఁడవే? యుద్ధముఁ జేయఁగలవా ? నేను నీకొక సూక్తముఁ జెప్పెదను వినుము. చెడిపోకుము.

లవ—ఇప్పుడేమియు నాకు వలదు. ముందు నీవే పలాయన సూక్తము జెప్పెదవు. నేను వినెదనఁట లెమ్ము.

సేనాధి—వెంట కాపుదలగా వచ్చినవాఁడు శత్రుఘ్నుఁడు. ఏమని తలచితివో !

లవ—ఔనయ్యా ? ఏమి బెదరించెదవా ! గ్రామమునకు సింహమైన నడవికి సింహమగునా ? ఇదిగో నేనొక్కటిచెప్పెదను. గట్టిగ మన సున నుంచుకొనుము ! నేను దీనిని వదలను. మీరు నాతో యుద్ధముఁజేసి ప్రాణముల విడువకుఁడు.

సేనాధి—(మహాకోపముతో) ఏమిపొగరు బాపఁడా ! ఎద్దుకాలిలో ముల్లంతలేవు. మితిమీరి మాట్లెదవా ? సైనికులారా ! ఈసుంత కాయను గుఱ్ఱమును గట్టిన చెట్టునకుఁ గట్టి గుఱ్ఱమును ప్రయాణము నకు సిద్ధపరుపుఁడు. (సైనికు లట్లుచేయ యత్నింప లవకుమా రుఁడు వారినందఱిని బాణములచే గూల్చును.)

[ప్రవేశము: శీఘ్రయానమున శత్రుఘ్నుఁడు పాడుచు]

(అనుబంధము 24)

శత్రుఘ్ను—ఓరీ! బాపనకుఱ్ఱలారా! ఎవ్వరీయశ్వమును గట్టిరి ? ఎవ్వరీ సైనికులఁజంపిరి ? తొలుతఁ జెప్పుడు.

1 బాలక—(భయముతో) అయ్యా ! అయ్యా ! మేముకాదు. మా గ్రహచారము చాలక వీనివెంట వచ్చితిమి.

2 బాలక—గుఱ్ఱమును బట్టినది వీఁడే. కట్టినది వీఁడే.

3 బాలక—(లవకుమారునిఁ జూపుచు) మీవారిని గొట్టినదియు వీఁడే నయ్యా ! వీనియిష్టము. మీయిష్టము.

లవ—(స్వగతము) ఈ దేశము వారికున్న రోగమే యిది. ఐకమత్యము అసూయ మీకు గలిగియుండిన దేశ మిట్టిస్థితి కేలవచ్చుచుండెను ?

శత్రుఘ్న—(స్వగతము) ఆహా ! ఏమి యీ బాలకుని తేజము ! బ్రాహ్మణోచితవేషమున నున్నను నివురుగప్పిన నిప్పువలెఁ బైకిఁ దన శక్తినిఁ జూపుచున్నవాఁడు. వీర రసము మూర్తీభవించిన ట్లున్నది. జగత్సంహారకాలమున ప్రతాపరేఖచేత రాజించు నట రాజబాలకునిఁబోలె నున్నాఁడు.

సీ. పినతల్లి జాహ్నవి కనుఁగొన భూమినిఁ
జేరిన గౌరీకుమారుఁ డనఁగ
కుసుమబాణరణంబు వెసఁబాసి శస్త్రాస్త్ర
మహిమమూనిన మారకుమారుఁ డనఁగ

విలువిద్యవై చిత్రి తెలియంగ దెలుఁబూని
నట్టిజయంతు కుమారుఁ డనఁగ
బాలరూపముఁ బూని చాలఁగ వెలుఁగొందు
భూరిపరాక్రమసార మనఁగ
గీ. మహిత సుకుమారతావిక్రమంబు లోక
లక్ష్యమందునఁగాన్పింప లలితరీతి
ముదముఁ గలిగించి సర్వుల మోహపఱచి
యిట్లుమించెడు యీబాలుఁ డెవ్వరుండొ.

(ప్రకాశము) ఓరీ! మునిబాలకా! ఏమి యీ కార్యము? పవిత్రతర అశ్వమేధతురంగము నీకుఁబట్టనౌనే? బాపకుట్టుఁ డెక్కడ? శత్రుజనభీషణ రఘురాజులెక్కడ? తెలిసి పట్టితివా? తెలియక పట్టితివా?

లవ—గౌరవము వదలి మాటలాడకుము. హెచ్చరిక. ధీరుఁడగు బ్రాహ్మణబాలుఁ డెక్కడ రఘురాజులో యేరాజులో అక్కడ. ఇంక ప్రేలితివేని అక్కడ యమలోకమున నుండగలవు.

శత్రుఘ్న—అయ్యా! నీపరాక్రమలక్ష్మి మెచ్చఁదగియున్నది. నీ వయోధ్యకు రమ్ము యజ్ఞకాలమున నీధనుర్విద్యను బరీక్షించి వలసిన బహుమతులు నీకిప్పించెదను. మృష్టాన్నభోజన మిప్పించెదను. రమ్ము. నీకేల యుద్ధము?

లవ—మాకెందుకయ్యా నీభోజనము? అడవియందు సంచరించుచు కాలముఁ గడుపుచున్న మాకు నీవస్తువులు. నీవాహనములు, నీ మృష్టాన్నభోజనము లెందుకు? నీకేమైనఁ గావలసిన మా యాశ్రమమునకు రమ్ము. వలయు ఫలహారముల నిప్పించెదను.

శత్రుఘ్న—అయిన నీ కేమి కావలయు?

లవ—సమానవిక్రమధనుఁడగు వీరునితో సమసంగ్రామము కావలయు.

శత్రుఘ్న—అయ్యో! బాలకుఁడవే? చిన్నారిచందురుని గేరు సుకుమారుండవే? అస్త్రవిద్యా పాండిత్యముచాలని చిఱుపాపఁడవే? నీతో

యుద్ధముచేయ నాకు మనస్సుపుట్టదుకదా? చనుబాలు పైనగ్రిమ్మ లేదాఁడలు దుర్వార పరాక్రమ రక్తకాంతిని బొందగలవే? పూల బంతులఁబోలె కోమలములై రంగారునీ భుజయుగ్మము శరశరధి కాండాసనముల మోయఁగలదే ? తిన్నవి తేగాలిసోకిన నించుక పడిమివాయు నీ లేజాళువా నెమ్మేను కాండీరప్రకాండసాయక ఖండ ములకుఁ దాళఁగలదే ? శృంగార కందర్ప మోహన రేఖలఁబోలె నెలరారు నీకనుబొమలు వికటభ్రూభంగరచనా క్రోధము నందఁ గలవే ?

సీ. లేయెండ కసిగందు నీతనూంగ మృదులత
దారుణాయుధముల తాళఁగలదె
చిగురాకుసొంపుల తగమీరుహస్తముల్
వరధనుర్బాణముల్ పట్టఁగలవె
చెలికాండ్రమాటాడ నలయు నీ నెమ్మోము
సింహనినాదంబుఁ జేయగలదె
పట్టుశాలువఁబూన భరమను నీవు నీ
మూపున తూణీని మోయఁగలవె
గీ. తెరచి తెరవక నెత్తమ్మి తెఱగు నించి
యొప్పు నీకన్నుగవ కోపమూనగలదె
బ్రిధన కర్కశ శత్రుఘ్ను ప్రబలరథిక
వర్యుతోఁ బోర సాధ్యమే బాలచంద్ర.

ఏలకో నిన్నుఁజూచినప్పటినుండియు వీరరసస్థానమున ప్రేమరసమును, కోప రసస్థానమున కరుణారసమును కలుగుచున్నవి. కుమారా ! ఈయుశ్వమును వదలి చిరకీర్తియుతుఁడవై, చిరకాలము మని నీ తల్లిదండ్రుల కామోదముఁ గలిగింపుము. ఇపుడు నాకుఁ గలిగిన కరుణారసమే యింకముందు నీయెడ నుండునని యెన్నటికిని విశ్వ సింపకుము.

లవ—అయ్యా! నీకరుణకు, ప్రేమకు, నాప్రణామములు నీవు బోధించు వాక్యము లతిహీనములు. వచ్చినవెంటనే శత్రువును వందిఁబోలె

బాగడుచున్న నీవేమి శౌర్యముఁ జూపఁగలవు. బాలుఁడైననేమి; వృద్ధుడైననేమి ? పరాక్రమ మొక్కటి కలిగి యుండవలయుగాక. దూదియెంతయున్ననేమి ? అగ్నికణ మొక్కటి దహింపదా ? ఎవరో రాముఁడని రామాయణకథయం దొక వీరుఁడుండెనని వినలేదా? అట్టి రాముఁడు కాకపక్షధరుడై యుండియు ప్రథమ కర్కశులగు సుబాహు మారీచులను నొక్క బాణమున ద్రెవ్వివైచి జక్కాడినది వినవా ? చేతఁగానివా రందఱిట్లే లోకమున మాట్లాడుట.

శత్రు—ఆరాముఁడే యిప్పుడు హయమేధ సవనమును చేయంబూని యీయశ్వమునుఁ బంపియున్నాఁడు.

లవ—అట్లనా ? మఱియు మేలయ్యె. అట్టివానితోఁ బోరి, వాల్మీకి మహానీంద్రులు నేర్పిన యస్త్రవిద్యా నైపుణ్యముఁ బ్రదర్శించి, లోకమున నెనలేని కీర్తిని సంపాదింపవలెనని యున్నవాఁడ. తొలుత నా రాముని రమ్మనుము. లేదేని నీవే యుద్ధమొనర్చిన పగిది నీ యపజయమాతని కెఱిఁగించి యతనిఁ బ్రోత్సాహపరుపుము.

శత్రు—ఓరీ ! బాలుఁడని పోవనిచ్చినట్లంతయు మీరి మీరి పలికెదవా? ఇఁక నిన్ను పేక్షింపఁజాల. రమ్ము. తొలుత నీప్రాణములను యుద్ధభూమికి బలియిచ్చెద.

(అనుబంధము 25)

(ఇరువురును యుద్ధముచేయుదురు.)

శత్రుఘ్ను—ఔరా ! మాటలుమాత్రము కఠినములని యెంచియుంటిని గానిఁ మాటలకన్న మనమును, మనస్సునకన్న బాణములును కఠినములై, కఠినాతితరములై, ఆసీవిషములఁబోలె నాపంచప్రాణములను హరించుచున్నవిగదా ? ఇంక తడిసిన ప్రమాదము. ఇదె యొక్క బాణమున వీని గూల్చెద. (అని బాణము వేయును. లవకుమారుఁడు మూర్ఛిల్లును.)

(యవనిక పడును.)



## చతుర్థాంకము—తృతీయరంగము.

సీత పర్ణశాలయం దుండును.

సీత—వాల్మీకిమానీంద్రు లింకను రారైరి. అయోధ్యాపురవృత్తాంత మించుకంతయుఁ దెలియదయ్యె. ఈయాశ్రమమునందుండెడి పరమ తాపసులందఱును నీకచిరకాలముననే శుభోదయమగునని వచించిరి. అది యెక్కడి శుభమో, యెట్లువచ్చునో ? అయ్యో ! శుభమను రెండక్షరములకు నాకును పుట్టువైరముకదా ? అకటా ! ఎట్లని యూరట జెందుదును ? దుర్వారలయకాలరుద్ర మహానేత్రాగ్ని నైనను సహింతును. కాలపక్వజనసమాజ సంహనన సంక్రీడనకుతూహల లేలిహ్యమానరసనాగ్ర మృత్యుదేవతావదన దంష్ట్రాసమ్మర్థముల నైన నోర్తును. పటుతర ప్రళయాభీలార్కమండల చండతర మార్తాండ వేడిమినైనను నొక్కింతయేనిజంకక సైరింతును. దుర్నివారదంభోళి సహస్రధారాపాతంబుల నన్నిఁటినినొక్కుమ్మడి క్షమింతునఁగాక; శ్రీరామచంద్రపదసరోజ సపర్యఁబాసి యెట్లుసహింతును.

ఉ. ఓర్తునరణ్యవాసమును, నోర్తు శిలాతలకంటకంబు లే
నోర్తును కందమూలముల, నోర్తు దవాగ్ని శిఖా పరంపరల్
ఓర్తును, సింహ, పన్నగ, గజోత్కరబాధల నింక నెమ్మదిన్
ఓర్వఁగలేను నీపదసరోజ సపర్యలఁ బాయ రాఘవా.

ఆసదయాంతరంగుఁడు నన్నుఁ బ్రతినిమేషమునను ధ్యానించుచు, మద్వియోగ పరితాప పరిభూతి నెఱుంగక నెట్లులున్నవాఁడో తెల్లియదు గదా ?

ఉ. ఎట్టులనున్నవాఁడొ ? మనుజేశుఁడు రామవిభుండు నక్కటా
యెట్టులనెంచినాఁడొ నను, నేగతి నాయెడబాటు నోర్చునో
ఎట్టులగర్భభారమును నీగెడు నంచనిపొక్కినాఁడొ ? నా
కట్టడిదైవమెట్లు ననుఁగాంచునో నోంచునో ప్రీతిబెంచునో.

కట్టా ! ఏది యెట్లున్నను నాశ్రితజన చాతకపోత జీమూతాయమానమై శాత్రవవర్గమనోభీషణ ప్రళయార్కబింబమై, రాజీవప్రభాసుందరమై యొప్పు నాశ్రీరాము ముఖచంద్రు నెన్నఁడుఁ గాంతును ?

మ. అకటా ! యెన్నడుగాంతు వాయుసుత నీహారాంశునీకాశమై
ప్రకటారిందమ రావణాది వనధిగ్రహిష్ణుప్రభాభాసమై
వికచాంభోజ విలాసమై మునివరా వేద్యంబునై యొప్పు భా
నుకులోత్తంసు ముఖాంబుజంబుఁ గను సమ్మోదంబు నీధారుణిక్.

(ప్రవేశము: బాలకుఁడు)

బాలక—అమ్మా ! సీతాదేవీ ! నీనందనుఁడు లవకుమారుఁడీనాఁడొక యశ్వమునుఁ బట్టెను. దానిని రక్షించుటకై నికులు కొందఱు వచ్చి యెంత చెప్పినను విడువఁడయ్యెను. వారికి ప్రభువగు నొక్క రాజ కుమారుఁ డనిఁజేసి తననిశితబాణముచే నీకుమారుని మూర్ఛనొందించి రథముపై నిడికొనిపోవుచున్నాఁడు. (నిష్క్రమించును.)

సీత—హా ! కుమారా ! (మూర్ఛఁజెంది లేచి)

(అనుబంధము 26)

అయ్యయ్యో ! ప్రళయాగ్నికీలల దహింపఁబడుటకుఁ దోడు మహాశని పాతము సంభవించినట్లు, శ్రీరామవియోగానలమున దహింపఁబడు నాకీపుత్రవియోగ మహాదుఃఖంబు రాజెల్లునే ? అక్కటా ! అదెక్కడి యశ్వము చనుదెంచె ? మా లవకుమారుని ప్రాణములకు మారియై వచ్చెనుగదా ! లవకుమారా ! పుట్టు నిర్భాగ్యురాలికి నాకు జనించితివి, కాననాంతర పర్ణశాలలో వసించితివి; కందమూలములే యాగిరంబుగఁ జేకొంటివి ! కృష్ణాజినంబులే దుకూలాంబరములుగ గ్రహించితివి ? కాని రాజనందనుఁడవై రమణీయ రాజవైభవంబులనొందవైతివి. మనోహరకనకభూషణంబుల ధరింపవైతివి, రారంజితగజతురంగారోహణంబులనానందింపవైతివి. సరసపక్వాన్న భోజనంబుల భుజింపవైతివి. వాటికన్నిఁటికి మారుగ ఘోరగిరికందర వృక్షచ్ఛాయనైన నుండక కదనరంగమున మూర్ఛిల్లి శాత్రవులచేఁ జిక్కితివా? కటకటా ! నీతల్లి నేమిచేయదలచితివి ? నీతండ్రి నీచరిత విన్న నెంతయో సంతాపంబుఁ బడునుగదా ? అయ్యో !

నీతండ్రిని, నీప్రేమంపుతండ్రినిఁ గన్నులారఁ జూడనైన జూడవైతివి గదా? నీపిన్నతండ్రులఁ గాంచవైతివి. మీయవ్వగార్లగు కౌసల్యా సుమిత్రాదులకు నెంతయు ముద్దాసంగవైతివి. ఇపుడూరక మమ్మం దఱ మహాశోకపారావారమున ముంచి వీరస్వర్గము నందితివా? దీని నేనెట్లు సహింతును? నాకుమారు నెట్లుగాంతును? శ్రీరామా! లోకాభిరామా! అనాథనైయుంటిని. ఇపు డపుత్రికనైతిని. రావే కావవే. నీపుత్రుని పాటుఁగాంచి, కరుణించి రక్షింపవే. హా! రామా! కుమారా! కుమారా! (మూర్ఛిల్లును)

(ప్రవేశము: కుశకుమారుఁడు.)

కుశ—ఆహా! ఏమిది? ఈపర్ణశాలయంతయు శాంతిఁ బాసి విద్యాహీనునిఁబోలె నున్నది? నాతమ్ముఁడు లవకుమారుఁ డేల యెదురు రాక యున్నవాఁడు?

సీ. నేవచ్చినంతనే యెదురేగుదెంచు నేఁ
డేలకో మాతల్లి యెదురురాదు
చెన్నారకూర్మి నన్నన్నా! యనుచుఁబిల్వ
నేలకో తమ్ముఁడు నెదురురాఁడు
నన్నందు రామాయణంబుఁ బాడుమటంచు
నడుగుతల్లి యదేల నడుగరాదు
ఆశ్రమంబునుజేర నట్టెనన్గూడెడి
బాలకులేలకో పలుకరారు

గీ. ఏమిచిత్రమొ, విషయమింకేమికలదొ
ఏమి వినవానొ, యనుభవ మేమికలదొ
ఏమి రానున్నదో, నాకు నేమిగతియొ
ఎఱుకపడదయ్యొ నక్కటా! యేమిసేతు.

మాతల్లి జానకీదేవి మేము వనమునుండి వచ్చినవెంటనే యెదురు చనుదెంచి యెత్తుకొని, ముద్దాడి, మేమభ్యసించిన విద్యల నడిగి, మాచే రామాయణకథను గానము చేయించి, యానందమునఁ గన్నీరునించి, ఫలభోజనములనిడి మా ముచ్చట లాలించుచు

కూర్చునియుండునుగదా ? ఆజనని యేల నన్ను గారాబమునఁ బిలువకున్నది? ఆమె పిలువకున్నను అమ్మా ! యని నేను పిలిచి నంతట నెంతటి కార్యముఁ జేయుచున్నను మాని ప్రేమనిండార కుమారా! యని చెంతకరుగుదెంచుచుండెగదా? నేడేల రాదయ్యో ? తోడిబాలకులయాలాపము లేల వినఁబడవు? నాతమ్ముని గానామృత మేల నా చెవులకు విందొనర్పకున్నది ? (మూర్ఛాగతులగుట తల్లినిఁ జూచి) తల్లీ! తల్లీ! ఏమియిది ? ఎవ్వరీమెకు పరిభవము గలుగఁ జేసిరి? అయ్యో ! ఈజనని స్మృతిఁబాసియున్నదిగదా? (అతనివస్త్ర మున గాలివిసరగా సీతలేచును,) అమ్మరో! నేఁ డీ కీడెవనివలన నీకు వాటిల్లె ? కాలసర్పము నెదుర్కొన నెంచినవాఁ డెవఁడు ? వాఁడు మానవుఁడైనను, దానవుఁడైనను, గీర్వాణుఁడైననుసరియే ఒక్కనిశితశరాగ్రమున వానిజీవితమునుఁ గొంచితెచ్చి నీ పాదముల కర్పించెద. స్వభావశీతలమును, పరమ పరిశుద్ధమును నగు నీమాన సమునకు కోపముఁ గలిగించినవాఁడు మహేంద్రుఁడగుగాక ? యుపేంద్రుఁడగుగాక? రణరంగమునఁ జచ్చినవాఁడే యనుకొమ్మా.

(అనుబంధము 27)

అమ్మా ! ఏల నీకన్నీరు నించెదవు ? ఏల నామాట లాలింపవు ? ఏల ప్రత్యుత్తరమియ్యవు ? నాతమ్మునికేమైన నాపదకలిగెనా ? ఇంకే మైన దుఃఖవృత్తాంతమును వింటివా ? నీకుమారుఁడనగు నేనుండ నీవు వేడికన్నీరు విడుతువన్న ముల్లోకములు కన్నీరు విడువవలయు ననుటయేకదా? సప్తసముద్రములఁగలఁచెద. మిన్ను మన్ను నేకము చేసెద. బ్రహ్మాండము పగల్చెద. తల్లి నేనేమైన నపరాధ మొనర్చి తినా ? అట్లుచేసియుండిన నిదే "పాహి" యని నమస్కరించువాఁడ మన్నింపుము.

శా. కన్నీరేటికి గల్గెనమ్మ, యికలోకం బెట్లుజీవించునో
కన్నారన్ గనుమమ్మ, యేకలుషుఁడీ కష్టంబు నీకిచ్చెనో
పన్నుంజేయుదునమ్మ, నేను ఘనపాపంబేమి గావించితిన్
మన్నింపందగునమ్మ, బాలుఁడనుకొమ్మా బ్రోవుమా మ్రొక్కెదన్.

సీత—(లేచి) తనయా! కుశకుమారా! నేను దిక్కులేని దాననయ్యు
మిమ్ములఁ జూచి యున్న దుఃఖసాగరము లేదనుకొని లేని ప్రపంచము
న్న దనుకొని యెటులనో కాలముగడుపుచుంటిని. ఎండచే తప్పఁడ
గువానికి దావాగ్ని చుట్టుకొన్నట్లు పుత్రదుఃఖము నన్నావరించె. నా
ప్రాణపదమును, నాయనుంగు మాణిక్యమును నగు నా కుమా
రుఁడు నాకు నేఁడు లేడయ్యె. వానినిఁ జూడక క్షణమైన జీవము
భరింపఁజాల.

కుశ—ఎవరు? ఎవరట్లు చేసిరి. చెప్పుము? కన్నుమూసి తెరచునంత
లో నీకుమారుఁడు నీ పాదముల చెంత నుండఁగలడు.

సీత—అన్నా! ఎవరో రాజకుమారుడట! రథముపై నిడుకొని యరణ్య
మునఁ బోవుచున్నాఁడట. మునికుమారుల నడిగిన తెలియఁగలదు.

కుశ—అమ్మా! నాకు సెలవిమ్ము. వీరజననివగు నీవు పరితపింపకుము.
అచిరకాలములోనే నా తమ్మునితో నీకు నమస్కరించెద. అటుగా
కున్న నీకు నేను కుమారుఁడఁ గానని తలంపుము.

ఉ. భానుఁడు గ్రుంకకుండ పరివర్గముఁ జంపి మదీయసోదరున్
నేనిటు దెచ్చువాఁడ నది సిక్కము గానిచొ పుణ్యదూరులున్
హీనులు, పంచపాపులును నేగెడు నారకవహ్ని జొచ్చెదన్
మానెద ప్రాణముల్ పనుపుమా ననునీపద సాక్షి యమ్మరో.

సీత—కుమారా! వలదు. వలదు. భర్తృవియోగముననుం, పుత్రవి
యోగముననుం, సకలబంధువియోగమునను తాళజాలక జీవము
నన్నుఁ బాయనున్నది. ఆసమయమున నీవును నా చెంతనుండక
దిక్కులేని మరణ మొందుమంటివా?

కుశ—తల్లిరో! ఏలశోకించెదవు? నీకుమారుండు మృతుఁడై యుండఁడు.
లోకజనయిత్రివగు నీయాశీర్వచన ప్రభావముననుం, మా గురువర్యు
లగు వాల్మీకుల పరమానుగ్రహరక్షణముననుం నాతమ్మున కేమియు
నపాయము కలిగియుండదు. ఒకవేళ కలిగియున్నను నాయమునిఁ
బట్టి నీచెంతకుఁ గొనితెచ్చి మరల బ్రతుకునట్లుఁజేసెద. భయపడ
కుము. నాశీర్వచన మిమ్ము. (నమస్కరించును)

సీత—కుమారా! శీఘ్రముగఁ బోయిరమ్ము. శ్రీరామచంద్రుని మహిమయు, కరుణయు మాయందుఁ గలదేని నీకు సర్వజయమును, సర్వసిద్ధియును కలుగుఁగాక. నేను శ్రీరామభద్రుని పాదారవిందముల నెల్లెడ ధ్యానింతునేని, అతనిఁదప్ప వేరొండు దలపనేని, ఆరఘురాముఁనకు రావణాది యుద్ధమున సంపూర్ణ జయము కలిగినట్లు నీకును కలుగుఁగాక!

సీ. ఘనమనోవాక్కాయ కర్మల శ్రీరాము
    దైవమంచని యాత్మఁ దలతునేని
నీరేజసంభవ నీరేజనాభాదు
    లెందు నాసాధ్వీత నెంతురేని
కుంభసంభవముఖ్య గురుమానిచంద్రులు
    కలుషహీనఁగ నన్నుఁ గాంచరేని
ఆవేదచంద్రార్క మవనిపై రఘురాము
    చరితంబు తిరమునై వరగునేని
గీ. నినకు లేశ్వరుకృప మీఁకు నెసఁగు నేని
సర్వజయమును, శక్తియు, సర్వదమము
సర్వశస్త్రాస్త్రసంసిద్ధి సర్వశుభము
యశముకల్గుత నీకు నోకుశకుమార.

తనయా! ఇదె జగత్పవిత్రమై, సకలాపత్తారకమైన శ్రీరామమంత్రమును పదేసించెద. దానిని జపించుచు పొమ్ము. (యవనికపడును)

---

చతుర్థాంకము-తురీయరంగము.

స్థలము:-అరణ్య ప్రదేశము.

[ప్రవేశము:-కుశకుమారుఁడు పాడుచు వెంట మునిబాలకులు]

(అనుబంధము 28)

కుశ—మునికుమారులారా! వారిం కెంతదూరమునఁ బోవుచున్నారు?

బాలక—అల్లదే! రథనేమిధ్వానములును, తురంగహేషారవములును వినుపించుచున్నవి. క్రోశదూరమునఁ బోవుచున్నారు!

కుశ—అయిన వారిని మనము పాదచారులమై యెదిరికొనుట కడు దుర్లభము. కావున శబ్దభేదిబాణములను ప్రయోగించి వారిని మొదట నిలువరించెదను. పిదప మనము పోయి వారిని గలిసి కొందము. (అని బాణమును ప్రయోగించి నిష్క్రమింతురు.)

(వెనుక యవనిక నెత్తగా నొక ఘోరారణ్యము కనుపించును. అందు శత్రుఘ్నుఁడును సైనికులు నుందురు.)

[ప్రవేశము—కుశకుమారుఁడు]

కుశ—

శా. ఓరీ రాజకులాధమా, కలుష కర్మోన్మత్త, దుశ్శీల, యో
క్రూరా! ధర్మవిదూర, యీబుడుతనిన్, ఘోరాహవానుప్తునిన్
వీరుండంచును గొంచుపోయెదె నినున్ వేఁజంపి క్షత్రాన్వయం
బారూఢిన్ సుపవిత్రమానటుల నిత్యామోదతన్ జేసెదన్.

ఓరీ! రాజాధమా! ఒకబాలునితో, ఏకరథునితో, అక్షౌహిణీ సేనా సమావృతుఁడవై పోరితివిగదా? ఇది క్షత్రియధర్మమా అందును విరథుఁడగువానితో సంగ్రామముఁ జేయనగునా? నీవు కిరాతుఁడ వగుదువుగాక క్షత్రియుఁడ వగుదువా? అంతట తనవిదీరక మూర్ఛ పోయిన మాత్రముననే రథముపై నిడుకొని పోవుచున్నావుగదా? కనుపరపుము నీశక్తి. తటి యొదవినది.

శత్రు—బాలకా! తొలుతనే నీసోదరునకు నేను యుద్ధము వలదని బోధించితిని. వీఁడు వినక ముష్కరతవట్టెను. కావున యుద్ధముచేసి మాగుఱ్ఱమును విడిపించుకొనుట నాకెంతయుఁ గర్తవ్య మగుటచే యుద్ధముఁజేసితి. ఇది యజ్ఞాశ్వమును రక్షించుటకాని యుద్ధము కాదు. కావున యుద్ధధర్మము దీనికన్వయింపదు. నేనీ బాలునిఁగొని పోవుట చికిత్సయొనరించి, మూర్ఛదేరించి, మారాజునకు జూపి, మంచిబహుమాన మిప్పింపవలయునని కాని వేరొండు దురుద్దేశ మునఁగాదు. ఇఁక నీ వేమనునది చెప్పుము.

కుశ—నే ననునదియా! తొలుత నాతమ్ముని, నాతమ్ముఁడు పట్టిన యశ్వమును నాకప్పగింపుమని యెద. కాకున్న నీవు చచ్చితివని యెద.

శత్రు—బాలకా! నీతమ్ముని నవశ్యము గైకొమ్ము, వల దనను, ఈ యశ్వమునుమాత్రము నీకివ్వను. నీవును నీతమ్మునివలె మౌర్ఖ్యము పట్టక పొమ్ము. తాపసులకు సత్వగుణ ముండవలయుఁగాక తమో గుణ ముండరాదు.

కుశ—నీవు యుద్ధము చేయవచ్చితివా? లేక పిరికివందవలె ధర్మ శ్రవణము జెప్పవచ్చితివా? నీకుఁ గావలసినన్ని ధర్మముల నే నుపదేశింతును. రమ్మునావెంట. ఈగుఱ్ఱము నీయదియే కాని దానిమోము పైన నేవో యక్షరములున్నవఁట! అవి గుఱ్ఱము నీది కాదనియు; శౌర్యగుణము పాలిటి సొత్తనియుఁ జెప్పుచున్నవి నేను శూరుఁడను. కావున నిది నాసొత్తు కాదంటివా ముఖమునను యక్షరములఁ దొలఁగింపుము.

శత్రుఘ్న—మీరిద్దఱును నొక్కముహూర్తమునఁ బుట్టితిరా యేమి? తురగము నివ్వను. ఏమిచేసెదవో చేయుము.

కుశ—చేయవలయునా? ఇదిగో చేసెద చూడుము.

(అనుబంధము 29)

(బాణముల తొడగి బాణము వేయ శత్రుఘ్నుఁడు మూర్ఛఁబోవును. లవకుమారుఁడు తటాలున లేచును.)

లవ—(ఆతురముతో) అన్నా! ఎప్పుడు వచ్చితివి? వాఁడేడీ? ఆ గుఱ్ఱ మేదీ?

కుశ—ఆవృత్తాంత మంతయు సవిస్తరముగ వచించెదను రమ్ము.

లవ—వచ్చుటెక్కడికి? ఈయశ్వమును వదలిపోయిన దీనిఁ గాపాడు వా రెవరు?

కుశ—తల్లికి నమస్కరించి యామెకన్నుల జల్లఁగఁ జేసి మరల శత్రు సైన్యము వచ్చువఱకు వత్తమురమ్ము. (నిష్క్రమము.)



## చతుర్థాంకము: పంచమరంగము.

స్థలము—పర్ణశాల.

[జనకుఁడును సీతాదేవియు నుందురు.]

జనక—అమ్మా! నినుఁ గాంచుటచే నామానసమున నెలకొనియున్న విమోహము ననుఁ బాసి చనియె. సకల పరమార్థసంభూతి యొసంగె. తల్లిరో! నీవిందు శిశిరమానసమున శోకింపకుము.

చ. ముదముచెలంగెనమ్మ పరిమోహము బాసెకదమ్మ సర్వసం
పద లిటుఁగూడెనమ్మ పరిభాసురకీర్తి యొసంగెనమ్మ యో
సుదతిరో నిన్నుఁగాంచ మది శుద్ధతనొందితినమ్మ వేగ నీ
హృదయవిశోకము న్విడి ప్రహృష్టతనొందితినమ్మ జానకీ.

సీత—జనకా! నీపరిశుద్ధ హృదయ పుత్రికనై లోకమున నేమిసుఖ మనుభవించితిని? మిహిరవంశపుఁగోడలినై, మహితగుణ పరాక్రమల సమాన శ్రీరామచంద్రుని ప్రియభార్యనై, యిన్ని కష్టముల ననుభవించి తుదకిట్టి యపారనిందా మహావిషరోగమును పడయుఁ బాల్పడితిని బీదవాని గృహిణికున్న సౌఖ్యమును సైతము నాకు గలుగదయ్యెగా?

ఉ. కంటిని కంజనీపతివికాశిత వంశపు కోడలౌ సిరిన్
కంటిని లోకనాథరఘుకాంతుని కాంతుని నొందుభాగ్యమున్
కంటిని దైత్య వానర వికస్వర సార్వవిభుత్వ సంపదల్
కంటిని యిప్పుడున్నతవికత్థనలోక దురుక్తి శస్త్రముల్.

జనక—అమ్మాయీ! యోచింపకుము. సర్వలోక పాలన మహాకారణ శరీరులై సీతారాములుగ నుద్భవించిన మీకు సర్వనిందలు సర్వకష్టములు లోకనిడంబరార్థము నొందవలసి వచ్చెగాక మీకు లోకాపవనిందయు, ప్రాపంచిక దుఃఖమును పరమార్థముగఁ గలుగఁ గలదే? అది యుండనీ, నీ నందనులను జూడవలయు నను కుతూహలము నన్నుఁ ద్వరపెట్టుచున్నది. వారినిఁ బిలిపింపుము!

సీత—ఇంతదూరము నాకై శ్రమనైన నంగీకరించి చనుదెంచి వచ్చితివి. ఇఁక నీముద్దు దౌహిత్రులఁ గాంచ నపేక్షించుటయు లోక

సహజమేకదా? వారొక యశ్వమునుఁ బట్టిరట. దానినొక రాజ కుమారుఁడు రక్షింప సమకట్టి వారితోఁ బోరుచున్నాఁడఁట. నీ పుత్రికాసుతులే జయము నందిరఁట. ఇంతలోననే వత్తురు.

[ప్రవేశము: లవ-కుశులు.]

లవ-కుశ—(సీతకు నమస్కరింతురు)

సీత—కుమారులారా! జయశాలులై వచ్చితిరా?

కుశ—తల్లీ! భవదీయ కరుణా పటిష్ఠకవచరాజము మ మ్మెంతయుఁ గాపాడుచుండ మేము జయశాలుల మగుటొక యబ్బురమా?

లవ—అన్నా! (జనకునిఁజూపి) ఈయన మొన్న ఖడ్గమృగమును బట్టి మనతో ధిక్కరించి మాటలాడెనే యాయనయే చూడుము.

కుశ—అమ్మా! ఈయనయెవ్వరు?

సీత—కుమారులారా! వీరు మీమాతామహులు, జనక రాజేంద్రులు నమస్కరింపుడు.

లవ-కుశ—(నమస్కరింతురు.)

జనక—(బాలకులను లేవనెత్తి) కుమారులారా! నాఁడు మీతో ఖడ్గ మృగమునకై మాటలాడునపుడే మీరు మా జానకీదేవి కుమారు లని తెలియును. కాకున్న నాప్రతాపసూత్తులు, నా మహాధైర్య రణలాలసమానసములు, నావచన రచనా పాటిగ్భల్యములు, నా యనంగకోటి సౌందర్య రమావిలాసములు, నాయంత సార్వభౌమ పదవీసూచిత మహాలక్షణ రేఖలు, నితరులయందు గనుపట్టునే, మిముఁ గాంచుటచే పుత్రవద్భాగ్యసమ్మోద మందితిని. నేఁడు ధన్యుఁడ నైతిని. నేఁడు కృతార్థుఁడ నైతిని.

కుశ—పూజనీయులారా! మాతల్లి మాతామహు లున్నారని చెప్పు చుండెఁగాని మేము చూచియుండలేదు. తమ విఖ్యాతియు, తమ సుజ్ఞాన సంపత్తియు, భవదీయ బ్రహ్మవిద్యా పరిపాటియు, మా వాల్మీకి మౌనీంద్రులవలన వినుచుంటిమి. ఇపుఁడు మా పూజ్య మాతామహుల కన్నారఁ జూచుటచే నీదినమును నీక్షణమును నీస్థలమును మాకు భాగ్యకరములని యెంచెదము.

లవ—మాతండ్రినిఁ జూచుభాగ్యము లేకున్నను తండ్రితో సమానులగు మాతామహులగు మిమ్ముఁ జూచుటచే నింక నెంతయో కాలమునుండి మేముకోరుచున్న మాజనకసందర్శనమును మాకు లభింపగలదని నమ్ముచున్నారము.

జనక—అందుకు సందియములేదు! మీతండ్రిని సత్వరముననే మీరు గాంచఁగలరు, కాని మీకెవ్వరితో యుద్ధము కలిగెను? వారెవ్వరు ధరణీశులా? ధరణీశాన్వయులా?

కుశ—ధరణీశాన్వయుల బోలె నున్నారు.

జనక—బాలకులారా! ధరణీశుడన్న మనదైవముఁబోలె నన్నవలయు నిరంతరవైష్ణవశక్తి యాప్రభువగువాని నావరించియుండుటచే నతఁడు శ్రీమన్నారాయణుఁ డనఁబోలు. రాజు మనల విద్యాదానముల వలనను, తత్తత్కాలాగత మహాభయనివారణమువలనను, నస్మదీయ రక్షణమునకై రాత్రింబవలు పరితపించుచు కన్నబిడ్డబోలె గాపాడుచున్నందునను, మనతండ్రి యనవచ్చును. కుమారులారా! అట్టి ప్రభువును సదా పూజించుండవలయును. ఏదేశమున ప్రభువునకై తమ తమ ధనప్రాణముల నర్పింతురో, యేదేశమున ప్రభువన్నఁ బరదైవముగఁ జూతురో యేదేశమున ప్రభువాజ్ఞ దైవాజ్ఞగాఁ బరిపాలింపబడునో యట్టిదేశము, మహాదేశము, మహావిభవదేశము.

శా. శ్రీనారాయణుఁడీజగంబులను రక్షింపంగ శ్రీయుక్తుఁడై
నానాభూమిసరూపభేదముల సన్నాహంబు చెన్నారఁగా
భూనారీమణి దుష్టవర్గములచేఁ బొక్కంగఁ దాఁబ్రోచుచుఞ
సానందంబుగఁ బుట్టెగాన నృపుఁడే యావిష్ణువో బాలకా!

చ. తలచిన చెంతఁజేరు పరధర్మపరాయణుఁ జేరి బ్రోచు తా
కలుషము నాచరింప నఱగంటనుఁజూచును భక్తియుక్తిచే
వలచిన కోర్కెలిచ్చు ఘనవర్గములందునఁజేరు మోక్షముఞ
కలుఁగఁగఁజేయు భూమిపతి కంజదళాక్షుఁడు చూడ బాలకా.

సీ. జననాది యేబాధ తనరకుండఁగ మమ్ము
గన్నబిడ్డలవోలెఁ గాచుకతన

పాంసుక్రీడాసక్తబాలుర మమ్మని
ర్బంధవిద్య లొసంగి పరగుకతన
గతహితాహితకృత్య ధర్మబోధలఁ జేసి
యిలలోన మ మ్ముద్ధరించుకతన
బహురోగబాధలఁ బాసిబోవగ మమ్మ
నురువైద్యశాలల నుంచుకతన

గీ. కఱవునందైన నన్నాదికముల నిచ్చి
బోచుకతమున ధరణిని భూమివిభుఁడె
తల్లిదండ్రియు, బంధువు, దైవమిలను
ప్రజకు ప్రభుభక్తియుండంగవలయు నుండి.

మ. ఒక వేళన్ నిదురింపఁగావఁడు విహారోత్క్రీడ నాశింపఁడో
పికతోడన్ చరియించి దూర్తచయము న్వైరాదు కనిప్పవా
ల్పక శిష్టావళి బెంచుచుండు జనవర్గప్రాప్తకష్టంబు మా
మకకష్టంబని యెంచురాజు మనకు న్మాన్యుండు దైవం బిలన్.

మ. తనరాజ్యంబును భోగముల్ సకల సత్కార్మావళుల్ భూములున్
తనవిత్తంబును శస్త్రముల్ బలము నిత్యస్వాగతో శార్జనల్
తనకాయంబును ప్రాణముల్ మనకునై ధాత్రీశుఁడర్పించుఁగా
వున నాతండె ధరిత్రి సేవ్యుఁడు సదాపూజ్యుండు నో బాలకా.

కావున ప్రభుభక్తిపరాయణులై మీరు మనుట సర్వశ్రేయము.

లవ-కుశ—భాగ్యము, మాకు సెలవిండు. పోయివత్తుము.

(అని నమస్కరింతురు.)

జనక—పోయిరండు. మీకు శుభంబగుఁగాక!

లవ-కుశ—(సీతాదేవికి నమస్కరింతురు.)

సీత—మీకు దిగ్విజయం బగుఁగాక! (అని వారి శిరముపై చేయి సిడును.)

(యవనిక పడును.)

---

# లవ - కుశ నాటకము.

## పంచమాంకము.

పంచమాంకము:—ప్రథమరంగము.

స్థలము:— భాగీరథీ తీరారణ్యము.

[ప్రవేశము:—లక్ష్మణుఁడు సేనాయుక్తుఁడై]

లక్ష్మణ—(స్వగతము) ఔరా! ఇంతపాఁటు రఘువీరులకుఁ గలుగ నానే? ఎవ్వరో మునిబాలకులఁట! రణరంగ శత్రుఘ్నుఁడగు మా శత్రుఘ్నుని జయించువారఁట! ఇంతటి సిగ్గులచేటు రావచ్చునే? దానికిదోఁడు భరతుఁడుసైతము తమ్మునినూరడించుటకో యన్నట్లు తానును పెనుమూర్ఛ నొందెనఁట! వారేమి భూలోకమున కవతరించిన శివకుమారులా? లేక ధరణీతలమున సంచరించు వామన కుమారులా? అకటా! ఎవ్వరైననేమి? నాసోదరుల నగ్ని శిఖకు మహావృక్షమువలె నప్పగించితిని గదా? అకటా! దీనికేమనవలయు? మహాద్విరదకుంభవిదారణ పటిష్ఠ మహా నఖరంబగు కేసరిని శశసముదయంబు మార్కొనినట్లు, అచల మహోన్నత చామీకర గిరిని దోమలుడీకొనినట్లు, రాఘవవీరుల నెదిరించి హయమేధ తురంగమును బట్టువీరులు కలిగిరిగా? ఆదేవదేవి, యాలోకమాత, యా పురంధ్రిమణి యసురన్న నూరకపోవునే?

సీ. లోకైకపావని శోకతాపంబన్న
ఘనవహ్నియై మమ్ము గాల్పలేదె
అమల సాధ్వీమణి యపనింద బడఁద్రోయ
నది యయోధ్యను నంత నార్పలేదె
నిందుచూలాలిని నిష్ఠురాటవిఁజేర్ప
ధూమకేతువనంగఁ దుంచలేదె

మాభాగ్యచంద్రిక మముఁ బాయఁ బడరాని
బన్నముల్ మముఁజేరి బాధలిడవె

గీ. కులము వెలయించి సౌశీల్య మలరఁ బెంచి
శిరులఁ గలిగించి సత్కీర్తి చెలువునించి
వంతదొలఁగించి ముదమెద సంతరించు
జనని తొలఁగినఁ జేకూరె వనట లకట !

పోయి మొదట నాతమ్ముల విడిపించెదఁగాక ! (ప్రకాశము) సైనికు లారా! ఎక్కడున్నది మహ గుఱ్ఱము ? ఆ సైంధవమును గట్టివైచిన బాలకు లెందున్నారు.

సైనిక—దేవా ! పోయిచూచెదము.
లక్ష్మణ—తొలుతపొండు.
సైనిక—(నిష్క్రమించును.)

లక్ష్మణ—జానకీదేవి యయోధ్యబాసినదాదిగా మాకు ధైర్యోత్సాహములు బాయుచున్నవి. ఆ దేవి పోయినదాదిగా మాకన్నియుఁ గష్టములేవచ్చుచున్నవి. ఇంకను యేయనర్థములు రానున్నవో ? అక్కటక్కటా! సకలచరాచర జగత్పోషణములు, అనవరత పరమ హంసమనోరాజీవసంచరణములు, అపగతమోహాభక్తజనపరిపోషణ ములు అజస్రత్రియీకుటజ శిఖావతంస పల్లవారుణములు, ఆశ్రితజన మనోమోహాపసరణములు, రఘుకుల భాస్వర సత్కీర్తిగౌరవరవితర ణములు, నిజదాసమోక్ష వశీకరణములు, పరమయోగిదహరాకా శాలంకరణములు, నాజానకీదేవిచరణముల సేవించుపుణ్యము నాకు మరల కలుగునే ?

(ప్రవేశము: సైనికుఁడు)

సైనిక—స్వామీ ! అదిగో అక్కడనే మన ఘోట్టాణము కట్టఁబడి యున్నది. అచ్చట యెవ్వరును కాపుదల లేరు.

లక్ష్మణ—అట్లనా! మఱియు మేలయ్యె, మా భరత శత్రుఘ్నులతోఁ బోరాడిన బాలకులెచ్చటికిఁ బోయియుందురు? పోయి తొలుత మాగుఱ్ఱమును తెత్తము రండు. (నిష్క్రమింతురు.)

(యవనిక నెత్తగా హయముమాత్రము చెట్టునకుఁ గట్టఁబడియుండును. లక్ష్మణుఁడు దానిని సమీపించి దానికట్లను వదలింపఁ బ్రయత్నించును. అచ్చటనున్న గుండువెనుకనుండి లవ-కుశులు వచ్చి సైన్యమును ధ్వంసము చేయుదురు! లక్ష్మణుఁడు దిగ్భ్రమముతో బాలకులఁ జూచుచుండును.)

కుశ—ఏమయ్యా! అట్లు చూచెదవు? నీకేమి దయ్యము పట్టినదా?
లవ—దయ్యముకాదురా. మనముఖములపైన కోతు లాడుచున్నవని చూచుచున్నాఁడు.

చ. పెరుకనుగొన్న భాస్వరత బాణపరంపరఁదేల్చి పేర్చుకన్
సారగెడుచూపులన్ రిపులఁజూచిన పూజయొనర్తురే యరుల్
పరుసము మానబా పఁడవె, పౌరుషహీనత స్థాణురీతి నీ
వఱుదుగ మమ్ముఁజూడ కపివర్గము లాడునె మాదు మోములన్.

కుశ—అదియును గాదురా. ఆకాశమును క్రిందుచేయుదునా, భూమిని పైనజేయుదునా యని యాలోచించుచున్నాఁడు. కాదేమయ్యా?
లక్ష్మణ—(స్వగతము) వీరిమాటలకు నవ్వువచ్చుచున్నది. కోపమును వచ్చుచున్నది. ప్రేమరసము నేనున్నా ననుచున్నది. ఏమిచేయుదును? (ప్రకాశము) ధూర్తబాలకులారా! ఇవి పిన్నాటలు కావు సుమా! మీరు మహాపరాధముఁ జేసియున్నారు. ఇఁకమీరు దక్కరు.
కుశ—ఎటులనయ్యా మాకు భయమగుచున్నది?
లవ—ఈముఖమేనా మము దక్కనివ్వనిది? మొన్న మాతో యుద్ధము చేసిరే యెవ్వరో భరతుఁడట! శత్రుఘ్నుఁడఁట! నీవును వారున్న చోటునకే పోయెదవా?

కుశ—నీ పేరేమయ్యా? చెప్పుము మాకుఁ గొంచెము గావలసి యున్నది.
లక్ష్మణ—ఏల?
లవ—నీవు రణక్షోణిని క్రిందపడిన తర్వాత నింకొకఁడు యుద్ధమునకు వచ్చునే వానికి నీపేరు చెప్పుటకు.
లక్ష్మణ—ఊరకున్నట్లంతయు మేలములాడుచున్నారా? బుద్ధిచాలదు. గుఱ్ఱమునిచ్చి యావలపొండు.
లవ—ఊరకుండకున్న నేమిచేసెదవు?
కుశ—అదియు చెప్పవలయునా? ఊరికిఁ బరుగెత్తిపోవుదువు.

లక్ష్మణ—బాలకులారా! ఇది శ్రీరాముని హయము. అతని తమ్ములు లోకైకవీరులని వినరా? అవివేకమున జెడిపోకుఁడు.
లవ—అతనితమ్ములను బాగుగ నెఱుగుదుము. ఇద్దఱి నిదివరకే యెదిరించి మఱచిపోయియున్నారము. ఇప్పుడు నిన్నెఱింగితిమి.
కుశ—శ్రీరాముఁ డెవఁడయ్యా? ఏమో చాల పొగడుకొనుచున్నావు?
లక్ష్మణ—శ్రీరామునే యెఱుఁగరా? అతని చారిత్రము రామాయణముగా సర్వలోక పూజనీయమైయుండదా?
కుశ—ఓహో! అతఁడా? వాలితో యుద్ధముఁ జేయలేక దొంగవలె చెట్టుమఱుఁగుననుండి యన్యాయముగ బాణమునఁ జంపిన వాఁడు!
లవ—అన్నా! రాముఁ డెవఁడు? తాటకయను స్త్రీనిఁజంపిన వీరుఁడా? అయ్యా! నీవా రాముని కేమికావలయును? కుమారుఁడవా? తమ్ముఁడవా? బంటువా?

లక్ష్మ—సీ. తాటకమర్దించి తపసియాగముఁగాచె
శ్రీరాము నెఱుఁగరే శిశువులార!
లవ— ఆడుదానిని జంపినట్టి మీరాముని
నెఱుఁగమే యతఁడొక్క వీరుఁడౌనె!

లక్ష్మణ—వాలిని నొకకోలఁ గూలనేసిన రాము
బలమును దెలియరో బాలులార!
కుశ—చెట్టుచాటునదాగి చేరి కోఁతిని జంపు
ధీరుని మీరాముఁ దెలియలేమె!
లక్ష్మణ—మాయామృగంబైన మారీచు నటుఁజంపె
వరరాము నెఱుఁగరో బాపలార!
లవ—చేరిన బరుదెత్తు జింకపిల్లను జంపు
శ్రీరామునీవింత చెప్పనగునె!
లక్ష్మణ—వరలోకవీరుఁడౌ పరశురాముని నోర్చు
ఘనరాము మీరేమి వినఁగలేదె!
కుశ—బడుగుబాపని భంగపఱచు టబ్బురమౌనె
సిగ్గుచేటుగ మాకుఁ జెప్పనేల!
లక్ష్మణ—గీ. త్రాహియని భక్తి వేడుఁ డారామవిభుని
పరగ రక్షించు యుద్ధంబు వలదువలదు
లవ—పాహియంచని రాముండు వచ్చెనేని
హాయము నిత్తుము మరిమాట లాడవలదు.

లక్ష్మ—బాలకులారా! పసివారు కావున తెలియక రాముని నిందించి నను నూరకుండవలసివచ్చెను. ఇఁక మితిమీరిన నీ లక్ష్మణుని క్షమాగుణము మిమ్ముఁ గాపాడునని తలఁపకుఁడు.

లవ—నిలువుము నిలువుము. నీవేనా లక్ష్మణుఁడవు? కాదయ్యా నీపేరు నకు పూర్వాపరబిరుదపదములు లేవా? అవనీధవ లక్ష్మణుఁడవా? భూపతిలక్ష్మణుఁడవా?
కుశ—కాదురా, 'అవనీధవ' యనుచోట "నీధవ" అనునది తీసివేయుము. ఇతని కదియే చాలును. అయ్యా! నీసంగతి మాకు తెలియును. నీపరాక్రమము మేమును కొంచెము వినియున్నాము. నీవా యింద్రజిత్తుతో యుద్ధముఁ జేయుచు నతని నోడింపలేక 'ధర్మాత్మా సత్యసంధశ్చ రామో దాశరథిర్యది' అని "రాముఁడు సత్యసంధుఁ

డగుసేని; ధర్మాత్ముఁ డగుసేని, యీబాణ మింద్రజిత్తును జంపును గాక" అని చెప్పితివే యదియే చాలును నీశూరత్వమును చాటించుటకు.

లక్ష్మ—మునికుమారులారా! మీరు బాలకులనియు, బ్రాహ్మణులనియుఁ దాళితి. ఇంక తులువకూతలు కూయక యుద్ధభూమినుండి తొలఁగెదరా లేక నాబాణవృష్టికి మీజీవితాగ్ని సప్పగించెదరా?

లవ—సహోదరా! ఇతనితో పరిహాసమును చాలును. ఇతనిగోడు వినఁజాలము. ఏమయ్యా! మేము యుద్ధమునుండి తొలంగవలయునన్న శత్రుస్తోమముల నీలోకమునుండి తొలఁగించినతర్వాతనే. తెలిసితివా?

(అనుబంధము 30)

లక్ష్మ—అయ్యా! కాండాసన విముక్త చండతర విశిఖ ప్రవాహములు గాని యాశ్రమవృక్షమునందలి లేఁజిగురుటాకులు కావు. కరవాల ఖడ్గక్షతక్షుభితరక్తమాంసాంచిత రణరంగముకాని సమారాధనభోజనాంగణముకాదు. కాండాసన కాండసముదయములుగాక మూపున మోయ దర్భసమిధలు గావు. బాపలు మీకేల యుద్ధము? మా పురికి రండు వస్త్రమాల్యభూషణాదుల నిచ్చెదము.

(అనుబంధము 31)

కుశ—ధరణీశా! ఏండ్లు మితిమీరివచ్చినవి. కాని బుద్ధి నీకు రాదయ్యె తెలివి యొకరిసొమ్మయ్యా? వీరక్షత్రియ వంశదీపకులమగు మాకు సమరభూమియే కదా? మోక్షస్థానము? ఇంత తెలియనైతివికదా?

సీ. చెలువారు పర్ణశాలలు లేకయున్నవే
మీరిచ్చు బంగారు మేడలేల.
రుద్రాక్షమాలికల్ రూఢిలేకున్నవే
సొగసైన రత్నాల సొమ్ములేల

నలువారుకృష్ణాజినములు లేకున్న వే
పట్టెమంచముతోడి పరుపులేల
కందమూలంబులు కలుఁగవే మాకెందు
భక్షించుటకు పిండివంటలేల
గీ. ఆదరంబగు వీబూదిలేదె మాకు
పొలుపునించెడు శ్రీగంధపూతలేల
దాసజనులేల జలతారుతాల్పులేల
యుద్ధరంగమె మోక్షంబు యోధవర్య.

(అనుబంధము 32)

లక్ష్మణ—మీరు క్షత్రియకుమారులా? మిమ్ముఁగన్న భాగ్యము గల తల్లిదండ్రు లెవరు?

(అనుబంధము 33.)

లవ—అది నీకేలనయ్యా? ఏమి వంశావళి వ్రాసెదవా? చేతనైన యుద్ధమున శాగతోస్మి యనుము. లేకున్న జితోస్మి యనుము.

(అనుబంధము 34.)

లక్ష్మణ—బాపలారా! లేవెన్నెలలు సోకిన లోవన్నె తరుగు మీనుకు మారములగు నునుదొడల కరవాల మిడుట పూలరాశియందగ్ని నిడుటయే కదా? చెఱువారు కమలనాళముఁబోలు మీకంఠసీమ నర్ధచంద్రసాయకములఁ బ్రయోగించుట మాలతీలతానిచయముల విత్రమునఁ దరుగుటయే కదా? ఏల మూర్ఖతఁ బట్టెదరు?
కుశ—అయ్యా! నీవు క్షత్రియుఁడవయ్యు క్షత్రియధర్మమునుఁ దెలియక మాట్లాడుచున్నావు యుద్ధరంగమే కదా క్షత్రియులకు స్వర్గ ద్వారము? శౌర్యమే కదా రాజులకుఁ బరమధర్మము! అట్టి స్వధర్మ మును వదలి పరధర్మము నాశ్రయించుట నరకద్వారమే కదా? వేయేల? ఈయశ్వము నీశౌర్యమును మాకప్పగించిన దొరకునే గాని పనికిమాలినమాటల నాడిన దొరకనేరదు.

లక్ష్మణ—క్షత్రశిశువులారా! క్షత్రియులైనమాత్రముననే తారతమ్యమును విచారింపవలదా? వీరసూ కౌసల్యానందను లెక్కడ; పసికూనలగు మీరెక్కడ?

లవ—మీతల్లియే వీరసూకౌసల్యయైన మాతల్లి వీరాధివీరసూ యనుకొనుము. ఊరక వదరినఁ బ్రయోజనమేమి? శక్తియున్నఁ గూయక చూపుము.

లక్ష్మణ—ఔరా! నేను పసిపాపలని కరుణించి యుద్ధము వలదని బోధించినట్లంతయుఁ దిరిపెఁపు తిండి తలకెక్కి మాటలాడెదరా? ఇఁక మీశరీరంబుల మాలికలుగా వ్రచ్చి మాతురఁగముఁ గొనియెద.

(అనుబంధము 35)

కుశ—ఈగుడ్డిబెదరింపుల నెవ్వరినిఁ బెదరింపఁ జూచెదవు? కైకొమ్ము కోదండమును. కైకొమ్ము బాణతూణీరములను. నిన్ను యమునియింటి కతిథిగాఁ బంపెదను. (అని యుద్ధమాడుదురు. కుశుఁడు లక్ష్మణుని బాణముల నెగురఁగొట్టి ధనుస్సును విరచును.)

లక్ష్మణ—(స్వగతము) ఔరా! మోముల చక్కఁదనము చంద్రబింబమును మీఱ నస్త్రవిద్య శ్రీరామచంద్రుని మీఱుచున్నదిగదా? (ప్రకాశము) బాలకులారా! మీ వీరత్వమును మెచ్చితి. మీరు వీరవర్గ శిలోమణులగుదురు. మీకు వలయు బహుమతు లిప్పించెదను. తుద కర్ధరాజ్యమైనను యిప్పించెదను. అయోధ్యకు బోదము రండు. ఇఁక నా ప్రతాపాగ్నికి మిడతలుగా నయ్యెదరు. అప్పుడు మీతల్లి మీబోఁటి పుత్రరత్నములఁ బోగొట్టుకొని దుఃఖపుచావు జచ్చును.

లవ—ఏమయ్యా? మరల నీపిచ్చిమాటల మానకపోతివే? మాతల్లి రణరంగమున శత్రుస్తోమంబులఁ దునుమాడి వీరస్వర్గ మందినదియే పురుషార్థమని భావించునుగాని గ్రద్దబ్రతికినట్లు బ్రతికి తన వంశమునకును, దేశమునకును, తలిదండ్రులకును, గొంచమైన నుపకారము జేయకయున్న పుత్రకులను గాంచుట మేలని తలఁపదు.

ఉ. సారమహాస్త్రవిద్య భుజసారము మీరఁగ శత్రుపంక్తి సం
హారముఁజేసి శూరవరు లౌనన రక్తముజంపుపూర మా
వీరరమాంగ నామణికి వేడుక జేసినఁ దల్లి మెచ్చుఁగా
కారయ నూరుపేరులటు నందని నందనుఁ జూచి మెచ్చునే.

కుశ—నీరాజ్యము నీద్రవ్యము; మాకేమియువలదు. కావలసినమమ్ము దానమడుగుము. మేమే నీకిచ్చెదము.

లక్ష్మ— (అనుబంధము 36)

అయిన నాయత్నము లేదు. (అని దివ్యబాణములవేయ కుశుఁడు మూర్ఛపోవును. లక్ష్మణుఁడతని సమీపించి ) అయ్యో నేనెంత వలదని నను మానవైతివిగదా ? వ్యర్థముగా ప్రాణములఁ బాసితివే ? నిన్నుఁజంపి నేనెట్లు వెడలిపోదును ?

కుశ—నేనును నిన్నువదలి యెట్లుపోదును ? రమ్ము. (అని లేచి బాణమునుతీసి) ఓబాణమా ! మాతల్లి సుశీలయైన, మా గురువు తపోవంతుఁడైన నీవీక్షణమే నాశత్రువునుఁ బరిమార్పుము.

(అనుబంధము 37)
(బాణము వేయును లక్ష్మణుఁడు మూర్ఛిల్లును)

లవ—అన్నా! మనగురువు మహిమవల్లను, మన తల్లిమహిమ వలనను నీమహావీరుఁడు పడియెఁగాక, ఇతఁడు పరాక్రమధుర్యుఁడని తోచు చున్నది.

కుశ—సందేహమేమి ? ఇతఁ డత్యద్భుత పరాక్రమవంతుఁడని మన వాల్మీకు లప్పుడప్పుడు చెప్పుచుండలేదా ?

[ప్రవేశము:—మునిబాలకులు.]

అందఱు—భళి ! భళి ! మిక్కిలి సంతోషమయ్యె. మేమేమైన సహాయముఁ జేయవలయునా ?

లవ—(స్వగతము) ఇట్లుండవలయు. ఇపుడు లోకమంతయు నిట్లేయు న్నది. జయించినవారివంకనే యందరునుఁ జేరుదురు. (ప్రకాశము)

ఏమియు వలదు. ఊరకున్నఁ జాలును. పిచండిలా! నీవుపోయి మా తల్లితో మేమే జయించితిమని తెలుపుము. మేము మరల నెవ్వరైనవత్తురేమో కాచియుండెదము. పొమ్ము. మరల శీఘ్రముగ రమ్ము.

పిచండి—కానిమ్ము. (నిష్క్రమించును)

(యవనిక పడును)



పంచమాంకము—ద్వితీయరంగము.

స్థలము:—హిమవత్పర్వత ప్రాంతారణ్యము.

అంజ—ఆహా! హిమవత్పర్వతమున నివసించు మహర్షులవలన నేఁడెట్టి సంతాపకర వార్త వింటిని! అఖిలలోకమాతయగు మా జానకీమాతను రామచంద్రుఁడు ఘోరారణ్యములకుఁ బంపియున్నవాఁడట, స్వభావమూఢులై, యనూయా పిశాచావేశితులై, పరదూషణారోపణ మాత్రప్రవీణులై, ఘోరతరసంతాపసత్కీర్తిహారులైయున్న దురాత్ముల దుష్టాలాపనిందావాక్యముల మా రామభద్రుఁడు, మా దేవదేవుఁడు నమ్మి, యీయవాచ్య, క్రూరహింసాకార్యమొనర్చెఁగదా? ఆ సీతారాముల శ్రేయస్కరనిత్యాశీషములఁ గైకొని యచిరకాలము క్రిందనేకదా నేనీ తపోవనభూమిఁ జేరితి! ఔరా! ఈ యపవాదము సహజ సాధువులగు సాకేతపౌరులది కాదఁట! నాఁడు దండకాటవిని రామలక్ష్మణులచే భిన్ననాసా కర్ణపుటయై, లంకాపుర రాజ్యలక్ష్మి వినాశకారణభూతయైన శూర్పణఖయు, రావణాది దనుజ పరివంథి స్తోమంబులు బరిమార్పఁబడగా హతశేషుఁడై యెందో తప్పించుకొని బ్రతికియున్న యాకరాళుఁడును బన్నిన మాయోపాయ విజృంభణమఁట! కట్టా! కరుణారస మహిమాంచితములై, కమనీయ కమలినీ వేద శిరోవిలసితములై, ఘనతర సనకసనందన హృదయారవింద విలసితములై యున్న యాజానకీ పురంధ్రిమణీ రారంజిత నేత్రరాజీవంబులు నీరుక్రమ్మ, శోకరసమున వాడి యెంత కాంతిఁ బాసియున్న

వోకదా? శ్రీరామచంద్రు నర్ధాంగలక్ష్మియై, ముక్తి కాంతామనో హారమూర్తియై, భక్తులపాలిటి కల్పవృక్షకీర్తియై, దివ్యజ్ఞాన సద్గుణ స్ఫూర్తియై, లోకులందరానొనప, సకల గీర్వాణబృంద మచ్చెరు వంద విలసిల్లు పాతివ్రత్య మహిమంబున నెంతయు వాసికెక్కించి యున్న మాజానకీజనని యిట్టి తలఁపరాని యపనిందలపాలై పరిత పించి పరితపించి మెనలేని కడగండ్ల ననుభవించెనన్న నిక పామర ప్రాయిష్ఠమగు నీ ప్రపంచపువారిగతి యేమనవలయు ? ఆహా ! ఇంత దురంతము లగు వంతలకుఁ గారణ మారాకునపందలేకదా ? వారిని నేను మననిత్తునా? మదీయ వాలాగ్రంబున నా శూర్పణఖా కరాళుల కంఠనాళంబుల బిగియించి, పాదాహతి నలచి, దురంత పటుతరమదీయ ముష్టిఘాతంబున శిరంబులఁబగిల్చి, ఉభయకరతల భుజామర్దనంబున రక్తశోణితంబుల మెదిపి, ముద్దఁజేసి శ్రీరామచం ద్రుపాదకమలంబుల కర్పించెద. ఇదే పోయెద.

సీ. కనువారి కనువారి కలిగింప నలగింప
యపనింద విని యెంత నడలె నొక్కొ
భూధరావళిసు్రిక్కి భూధరావళిదక్కి
భూపుత్రిమది యెంత పొగలె నొక్కొ
రామసింహములోంది రామసింహము డింది
యకట మారుతి ! యంచు నరచె నొక్కొ
పరువారతరువార పరివారములఁ జెంది
తన తల్లిదండ్రులఁ దలఁచె నొక్కొ

గీ. రాల్రవాలుచు జాలి తా సోలెనొక్కొ
పరగ భూదారములఁజేరి భావమందు
తనదుభూదారు నెమ్మదిఁ గనియెనొక్కొ
మాదుజనయిత్రి భూమిపై మనియెనొక్కొ.

(అనుబంధము 38)

(పాడుచు నిష్క్రమించును.)

(యవనిక నెత్తగా నదే యరణ్యమున మఱియొకభాగము కనుపించును.)
[ప్రవేశము:-ఆంజనేయుఁడు పాడుచు]
(అనుబంధము 39)

ఆంజ—అయ్యో! నేనెందెందు వెదకినను మా సీతామాతగాని తుదకా శూర్పణఖాకరాళులుగాని దొరకరైరి. వెదకి వెదకి వేసరితిని. ఇచ్చట కొంతవిశ్రమించి మరల పోయెదఁగాక.

(అని చెట్టుమరుగునుండి ఫలముల భక్షించుచుండును.)

[ప్రవేశము: శూర్పణఖా కరాళులు.]

శూర్పణ—భళీ! కరాళా! నీవు కరాళుఁడవే సరి. భద్రుఁ డను పేరుఁ పెట్టుకొని రాముని సేవించి సీతకును రామునకును నెడబాటుఁ గలిఁగించితివి. ఇఁక రాముఁడు "సీతా! సీతా" యని మొరయెత్తి యేడ్చుచు నింకొక్క క్షణమునకో రెండు క్షణములకో ప్రాణముల విడుచును. రావణుఁడు కుంభకర్ణుఁడు, ఇంద్రజిత్తు చేయజాలక పోయిన పనిని నీ వవలీల సాధించితివి. ఇపుడు నామదినున్న దుఃఖ మంతయుఁ దీరె.

కరాళ—శూర్పణఖా! నీవు చేసినకార్యముమాత్రము సాధారణమా? చాకలిదాని వేషము వేసికొని యెంతబాగుగ నటించితివి? రాముఁడు కాని లక్ష్మణుఁడుకాని ఒక్కరుకాని నిన్ను గుర్తింపరైరిక దా?

శూర్ప—అంత వివాదమేల? నీవుకొంతపనిని, నేనుకొంతపనిని, సాధించితిమి. ఇంతటితోనే సంతోషింపరాదు. ఇల్లలికినంతనె పండుగయగునా? ముందున్నది ముసళ్ళపండుగ. సీతావియోగమున రాముడు పరితపించుచున్నవాఁడు. కాని, అతనికి నెవరో వసిష్ఠుఁడఁట, వామదేవుఁడఁట; యెప్పుడుచూచినను వేదాంతముఁ జెప్పుచుండుటచేత వాఁడు చావకున్నాఁడు.

కరాళ—కానిమ్మె. ఆ మునిముచ్చులపని తర్వాత తీర్చెదము. వారికి కండకావరమెక్కువయైనది.

శూర్ప—ఇంక మనము విచ్చలవిడి తిరుగాడవచ్చుగదా ? పోదము రమ్ము.

కరాళ—నీపుణ్యమగును. ఊరకుండుము. ఆ యాంజనేయుఁ డను కోఁతి యిపు డూఱలేదు. మనపని కొంచెము గట్టెక్కినది.

శూర్ప—వానిభయము నాకంతలేదు. కాని మాయన్న విభీషణునిచే నాకు భయము. నేనొక్క వైపునను నీవొక్క వైపునను పోయి మనకార్యము ఫలించినదా లేదా యని కొంతకాలము కాచుకొని యుందుము. ఒకవేళ యింతలోనే రాముఁడు మృతిజెందిన నది మన భాగ్యవిశేషమేకదా?

కరాళ—"మృతుఁడయ్యెనా? " ఏమట్లుమాటలాడుచున్నావు ? ఇంకను సందేహమా? ఇపుడు మనముపట్టినదంతయు బంగారమగుచున్నది.

శూర్ప—ఇంకొకటి నీవు వినలేదా? మొన్న పట్టాభిషేక మప్పటినుండి మాయన్న రావణుఁడు రామునిఁ బట్టియున్నాఁడట ! ఎందరెందరో భూతచికిత్సకులు, మహనీయులు వచ్చి చూచుచున్నారఁట! ఇది మిక్కిలి మనకు సహకారిగదా ?

కరాళ—ఔను. ఇఁక పోదమురమ్ము. (అని పోఁబోవ నాంజనేయుఁడు వెనుకనుండివచ్చి వారిని చెరియొకచంకలో నిరికించుకొనును.)

(అనుబంధము 40)

(నిష్క్రమము.)



## పంచమాంకము—తృతీయరంగము.

స్థలము:—భాగీరథీ తీరారణ్యము.

[ప్రవేశము—రాముఁడు]

శ్రీరామ—అహా ! గోరుచుట్టుమీఁద రోకటిపోటువలె నాకిట్టి దుర్దశ రాఁదగునే? హతభాగ్యమై, అపగతవివేకమై, యీ రామునిప్రబ్రతు కింతనిరర్థకమగునే? సూర్యవంశపు గౌరవమెల్ల నశింపఁ జేసితిని.

వచియింపరానిజనాపవాదశూలములపాలైతిని. ప్రాణాధిక ప్రియధన మగుమాసీత నన్యాయముగ నట్టడవినిదోలి తద్వియోగ దావాగ్నిం బొరలనైతిని. నాయనుంగు తమ్ముల విషమయుద్ధదేవతకు బలి యిచ్చితిని. దేనికి దుఃఖింతును? దేనికి వలవింతును? దేనికి పరితపింతును? ఆహా! మా జానకినిం జూపువారులేరే. అన్నిదుఃఖములను విధి నాకొరకై సృజించెఁగాబోలు? నాచే ప్రారంభింపఁబడిన హయమేధము హయముతోడనే నిలిచినట్లయ్యె! ఇన్నిశోకముల నన్ను ముంచి చంపినను మానెఁగాక పరలోకమునందునైతము ఘోరవాది నరకములు నాకై యెదురుచూచుచున్నవిగదా? యజ్ఞదీక్షా కంకణముఁ గట్టుకొనియున్న నే నెట్లుయుద్ధమునకుఁ బూనుదును? దైవమా! నన్నింత విషమపరీక్షణము చేయసాగితివిగదా? కానిమ్ము. ఏమేమి యనర్థములు, యేమేమి కష్టములు, యేమేమి విపత్తులు రానున్నవో యవి యన్నియు నాకు మహోపకారముగాఁ దలఁచి పరమసంతసమున భరించెదఁగాక. అకటా! నిరపరాధ, నిరస్త కల్మష యగు మా జానకిని, పూర్ణాంతర్వత్నిని గుట్టలఁ దోలి, కిరాతకృత్య మొనర్చిన నాకీగతిగాక మరేగతి రాఁగలదు? ఈ బాలకు లెచ్చటనుండి వచ్చిరి? వీరు బాలకులా? పరేత పాలకులా? పోయి చూచెదఁగాక. ఆ హయముండుచోటైనఁ దెలియదయ్యెనే?

సీ. చేరరే కలికిరాచిలుకలార చెలంగు
కోలకులార మయూర కలుకులార!
కదియరే సీత యానదములార సుకోక
నదములార సుపట్కపదములార!
వరికింపరే భూమిప్రతతులార ధరాజ
ప్రితతులార ప్లవంగ వితతులార!
అరయరే కాంత భూధరములార జలాంత
చరములార వనాభ్ర చరములార!

గీ. వనలతంగానరె శైలసదనములార!
వనములార మృగేంద్రయోగణములార;
వినుత భూపుత్రి యపరసావిత్రి యిందు
చూడరేమీరుమానిని బ్రోఘనిందు.

[ప్రవేశము— అరణ్యకవేశముల లవ-కుశులు]

లవ—ఆహా! ఈ మహానుభావుఁ డెవఁడో దేవాంశసంభూతుఁ డని తోఁచుచున్నది

మ. అరరే తేజ మపారమయ్యెఁ గనగా హరిప్రభాయుక్తమీ
సరసీజాతముఖంబు వక్షమును విస్తారంబుగా నొప్పె నా
యరుణాబ్జాతము లట్లునేత్రములు మాకానందముం గొల్పె నీ
ధరణీశేంద్రుఁ డెవండొ స్వర్గహరియో దైత్యారియో నారయన్.

కుశ—ఇతనితోఁబోరి జయించుట కష్టసాధ్యమనియుఁ దోఁచుచున్నది.

శ్రీరామ—బాలకులారా! మిమ్ముఁజూచిన నీయరణ్యవాసులని స్ఫురణ గలుగుచున్నది. ఈకాననమున మాయశ్వమేధ హయము నెవ్వరో మూర్ఖులగు యిరువురు మునికుమారులు పట్టియున్నారఁట! అది యెక్కడనున్నదో చూపఁగలరా?

లవ—అశ్వమున కేమి! చూపెదము. కాని మీ కౌతుకంగముతో నేమిపని?

శ్రీరామ—అది నాసవనాశ్వము, ఆ ద్విజకుమారుల జయించి దానినిఁ గొనిపోయి యజ్ఞమును సాంగము చేయవలయు ననుటయే పని.

కుశ—ఆబాలురు సాధారణముగ జయింపఁబడువారు కారే? యప్పు డేమిచేసెదరు?

శ్రీరామ—అది నాకునుఁ దెలియును. అయినను నేను వారిని జయించియే తీరవలయును. జయాపజయములు దైవాధీనములే కదా?

లవ—అయిన మీపేరేమి?

శ్రీరామ—నాపేరు శ్రీరాముఁడని లోకులందురు.

కుశ—ఇపుడు మాచే—కాదు—ముని కుమారులచే జయింపఁ బడిన వారలెవ్వరు ?

శ్రీరామ—వారు నా తమ్ములు. భరత లక్ష్మణ శత్రుఘ్ను లనువారు.

లవ—వారు మీకు కావలయునా ? ఆ గుఱ్ఱము మీకు కావలయునా ?

శ్రీరామ—అంతఃకరణమునుబట్టి వారును కావలయు. ప్రకృత కార్యమునుబట్టి తురంగమును కావలయు.

కుశ—మీ కాయశ్వముఁజూపిన మాకేమి బహుమానమిత్తురు ?

శ్రీరామ—తురంగమునుతప్ప మీరు కోరినదాని నిచ్చెదను.

లవ—అయిన మీతురంగ మిచ్చుటనే యున్నది చూడుఁడు. (అని చెట్టుమఱుఁగున నున్న యశ్వమునుఁ జూపును.)

శ్రీరామ—ఇదియే మా యశ్వము, అయిన దీనినిఁ గట్టిన వీరశేఖరులగు బాలకులేరీ ?

కుశ—గొప్పవారు మీ రపేక్షించినవారు దూరముపోవుదురా ?

శ్రీరామా—ఏమీ ? సమీపమున నున్నారా ?

లవ—సమీపముననే నననేల ? ఇందే యున్నారు. చూడుడు. (తమ యరణ్యవేషములఁ దీసి ధనుర్ధారులై యెదుట నిలువఁబడుదురు.)

శ్రీరామ—(స్వగతము) ఆహా ! వీరా యాశూరులు ? వీరిఁ గాంచిన నాకేదో యొకవ్యక్తి మనసున బాడకట్టుచున్నది. ఈరక్తరేఖాంచిత నేత్రములు, ఈనిడుదయురము, ఈ పున్నమ చందురుఁబోలు నెమ్మోముచూడ, వీరిని ముద్దాడవలయునని తోఁచుచున్నది. కాని కార్ముకముపై చెయిపోవకున్నదికదా !

సీ॥ మోములఁ దిలకింప ప్రేమయొప్పునుఁగాని
 కోపంబు నెమ్మదిఁ గూడఁబోదు
పలుకుల విన వేడ్క ధ్యెలుకునేకాని నా
 వీరసూక్తులమోము చేరఁజనదు

అంగశృంగారంబు పట్టి చూచునుగాని
కనుదోయి కింక కెంపెనయఁబోదు
ధైర్యంబుఁగన నద్భుతము గల్గునేగాని
కార్ముక మొగిఁబట్ట కరముచనదు
గీ. భళిరె యీబాలకులజూడ భావమలరె
చెలువు మాజానకీదేవిచిన్నెలమరె
వీర లెవ్వరొ ధీరతాసారులార
వీరవర్యులు బాపలు వీరు కారు.

లవ—ఇఁక మాయభీష్టముఁ దీర్చుటయేకదా తమకుఁ గర్తవ్యము?
శ్రీరామ—ఈరామునిచరిత్రము మీరువినలేదో? ఇచ్చినమాట తప్పు టయా? అదియెట్టిది?
కుశ—ఔనయ్యా! మాగురువులవలన మీగుణాతిశయములను విని యున్నారము. ఐనను నీకాలమున గొప్పవారినిమాత్రము నమ్మ రాదు.
ఉ. పెద్దలు పెద్దలంచు తగుపెత్తనముల్ వచరించు ధర్మపుం
సుద్దులఁజెప్పుచుందు రిల చూడఁగ జేయుటయన్న సున్నయీ
పెద్దలు లోకమందు బలుపెద్దలు వారిని నమ్మఁజాల నే
పెద్దలు దేశవృద్ధి నిటుపెంతురు నట్టిల కేను మ్రొక్కెదన్.

శ్రీరామ—తొలుత మీయభీష్టమేమో యడుగుదు.
లవ—మాకేమియు నభీష్టము వలదు. మీరు యుద్ధరంగమునుండి తొలఁగక మాకు రణదాన మొసఁగిన సర్వాభీష్టములు సమకూరినట్లే.
శ్రీరామ—(నవ్వి) బాలకులారా! మీముద్దారుపలుకులు నామది కెంతయు పారవశ్యము నిచ్చుచున్నవి. మీకు త్రిలోకాధిపత్య మిచ్చినను నాకుఁ దృప్తిగలుగదు. అయినను నీ దానము మీకేల!

మ. వలువల్ వేడుటొ, వన్నెసొమ్ములను తావాంఛించుటో, పిండివం
టలు నాశించుటొ, విత్తముల్ మదిని వేడ్కన్ కోరుటో, దంతివా

జుల కాంక్షించుటా, చూడ ధర్మములు మీక్షోణీ సురేంద్రాళికిఁ
కలనైనఁ రణమిచ్చు కోరనగునే కాంచంగ నోబాలకా.

కుశ—పరాక్రమమే భూషణముగా, శూరత్వమే జీవనముగా, ప్రజా
పరిపాలనమే ముఖ్యధర్మముగా నెంచు మాకు రణమపేక్షణీయ
మగుఁగాక ! యుదరభరణ మపేక్షణీయమా ?

శ్రీరామ—ఐన మీరు క్షత్రియకుమారులా?

కుశ—అది నోట వేరు చెప్పవలయునా ?

శ్రీరామ—మీయట్టి శుభమూర్తుల, మీయట్టి యభినవ కందర్పుల,
మీయట్టి విక్రమధనులఁ గని మధ్యమలోకమున కొక పెట్టనిభూ
షణమొసంగి ధన్యులగు మీజననీజనకులెట్టి మంగళాక్షరములచే
యలంకృతులో వచింపఁగలరా?

లవ—(జనాంతికము) సోదరా ! ఏమి యీ మహాపురుషుని వాఙ్మా
ధుర్యము? ఏమి యీవచనాచాతుర్యము ?

కుశ—ఇట్టి మహాశయునితో మాటలాడఁగలుఁగుట మనతల్లి యాశీ
ర్వచన ప్రభావమేకదా ?

లవ—సంగ్రామలాభము కలిగిన మఱియు మేలు. (ప్రకాశము) ఆర్య
భూషణా ! ఇది కదనరంగముగాని బంధువావివరుసల నడుగుటకు
పెండ్లింటిభోజనము కాదు.

కుశ—మీరేమి యశ్వమేధయజ్ఞమును చేయఁదలచుకొన్నట్లుఁ లేదు.

శ్రీరామ—ఏల ?

లవ—లేనిపోని మాటలతో ప్రొద్దుపుచ్చువారలకు కార్యమన్న సున్న.

శ్రీరామ—కుమారులారా! మీరీతుఱగమును బట్టుట తగిన పనికాదు.
అందును మీశౌర్యము మా తమ్ములయందు సార్థకమయ్యెనని
తలఁపకుఁడు. మీమోహనాకారములఁ గాంచి వారు పరాజున
మీచే వంచితులై నిర్జింపఁబడియుందురు, అంతమాత్రముననే యిం
తటిసాహసమునకు మీరు పూనుట మిక్కిలి లగ్గుగాదు, నామదియు

మిమ్ముఁ జూచినది మొదలు కరుణాంతరంగిత మైనందున నందున్న పరితాపాగ్ని చప్పచల్లారినది.

కుశ—మీ రేమి క్రిందపడినను పై చెయ్యనుచున్నారే? మీ తమ్ముల మాటటుండనిండు. మీ రేమి యుద్ధమున కుపక్రమించెదరా? లేక మాతో సంధి చేసికొనియెదరా? "బాలకుల కేలయుద్ధము" అంటిరి కదా? అది మిక్కిలి పొరబాటు. ఏ యభ్యాసముకాని బాల్యము నుండియే యలవడవలయు.

శ్రీరామ—ఇంక నాయత్నము లేదు. బాలులారా! మా గురువులు స్త్రీ శిశువులతోఁ బోరరాదనినందున నింత వచించితిని. కాని రావణ మారణమునఁ దృప్తినొందకున్న నా బాణములకు మిమ్ము బలియివ్వఁజాలక కాదు.

లవ—గురువాక్య పరిపాలనమన్న మొదట మిమ్ముఁ జెప్పవలయు. ఆనాఁడు తాటకను చంపితిరే? అది గురువాక్యమా? లఘు వాక్యమా?

కుశ—అతికాయునితోఁ బోరునప్పుడీ గురువాక్యమును మరచిపోయి యుంటిరి గాఁబోలు?

లవ—మా గురువాక్యము వినలేదే? లోకమున నెవరైన మాగురువు లట్లు చెప్పినారని చేయరానికార్యములఁ జేయువారిని, మాగురు వులు కలలోవచ్చి యిట్లు చేయుమనిరని పలుకువారిని, మాగురువు లకు గాను మీరు మాకు ధనమొసంగుఁడని మోసఁగించు వారిని నమ్మరాదని చెప్పియున్నారు.

శ్రీరామ—సీ. స్త్రీ బాలురఁజంప చెలఁగుపాప మటంచు
పలికిరి గురువు లోబాలులార!

కుశ—తాటకఁజంపుచో నేఁటికి యీబుద్ధి
కలుగకపోయెనో పలుకుమయ్య!

లవ—అతికాయుతోఁబోరు మని నీదుతమ్మునిఁ
బంపుచో గురువు వచింపలేదె

శ్రీరామ—ధరణీవిభుండౌట తండ్రిని మీకౌదు
తండ్రితోయుద్ధంబు తగునటయ్య

కుశ—ధరణీవిభుం డీవు తగలోకవిభుఁడు మా
తండ్రియాతనిమేముఁ దలఁతుమయ్య

శ్రీరామ—ఎవ్వడు మీతండ్రి? యెట్టిరూపమువాఁడు
యెందు తానున్నాఁడు? యెట్టివాఁడు?

లవ—దేవుఁడాతఁడు నీలదేహముకలవాఁడు
ఎల్లడనున్నాఁడు ఎల్లనతఁడు

శ్రీరామ—అతని పేరెయ్యది? అతఁడెప్పుడిటువచ్చు
అతనిఁగాంచెడివార లరయ నెవరు?

కుశ—అన్ని పేర్లతనివే యతని చేరఁగరాదు
యోగులు చూతు రాయోగపురుషు

శ్రీరామ—మీతల్లి యేసాధ్వి మీరిందు నుండుట
కరయగారణమేమి యమరులార

లవ—గీ. సర్వలోకైకజనని మాజనని యిందు
చేరియుండగ హేతువు చెప్పరాదు

శ్రీరామ— కనుల మిముగాంచ నేలకో కరుణగలిగె

కుశ— కరుణకాదది నీచేతగానితనము.

శ్రీరామ—చాలు నధికప్రసంగము. తాటకను చంపుట మా గురువుల యానతిచేతనే. అదియుండనిండు. మీగురువు లెవరు?

కుశ—వాల్మీకిమునీంద్రులే.

శ్రీరామ—వారివద్ద మీరు విద్యాభ్యాసముఁ జేసితిరా? (స్వగతము) హృదయమా! తొందరపడకుము. నీసంకల్పము సత్యమా? యస త్యమా? యని తెలిసికొనకనే చెదరకుము. (ప్రకాశము) మీరు వాల్మీకిశిష్యులా? మఱియు మేలయ్యె. వారు మీకు బోధించియే యుందురుకదా?

కుశ—ఓ చెప్పియున్నారు.

శ్రీరామ—ఎట్లు?

లవ—పట్టినపట్టు వదలరాదనియు, క్షత్రియధర్మము పాలింపవలయు ననియు, అదియే వీరధర్మమనియు.

శ్రీరామ—ధనుర్విద్య నభ్యసించెడి విద్యార్థులు వీరులగుదురా?

లవ—ధనుర్విద్యాభ్యాసకులు వీరులగుదురుగాక పట్టి మాటలాడు వారు వీరులగుదురా ?

శ్రీరామ—రాజనీతియందు యెక్కుడగు వానితోఁ బోరరాదని చెప్పఁ బడలేదా ?

కుశ—ఎదుటివారు మాకంటె యెక్కుడువీరులై నఁగదా?

శ్రీరామ—ఇది మీకు గర్వము కాదా?

లవ—ఇది మీకు దురభిమానము కాదా?

శ్రీరామ—దేహమును వ్యర్థముగ పోఁగొట్టుకొనవచ్చునా ?

కుశ—కనుక నే యీసాహసమునకుఁ బూనితిమి.

శ్రీరామ—పోనీ, మీతల్లి దండ్రుల యాజ్ఞనైనఁ బొందియున్నారా ? వారిగుఱ్ఱమును పట్టుఁడనిరా ?

లవ—ఏమయ్యా ! నీవు మంచిగట్టివాఁడవే, మెడకు వేసిన కాలికి, కాలికి వేసిన మెడకు వేయుచున్నావే ?

కుశ—మాతల్లి మాకు స్వధర్మములను రక్షించుకొని తనకు కీర్తిని తెమ్మని చెప్పినది, మాతండ్రి దేవుఁడు! గనుక ఆయనయు స్వధర్మ త్యాగముఁ జేసి పరధర్మము నాశ్రయించి దేశమును, కులమును నాశనముచేయుమని చెప్పలేదు. తెలిసినదా !

లవ—ఇతఁ డేమియుద్ధము చేయునురా ? మాటలు కోటలు దాటు చున్నవి. కాని కాలు గడప దాటకున్నది ! తమ్ములపాటుఁ జూచి నను నితనికి కోపమే రాదుకదా!

శ్రీరామ—ఆహా! ఇంక తడయుట దుస్సాధ్యము. కలుషాత్ముఁరాలా! ఇఁక మిమ్ము విడువను. (అని దారుణాస్త్రములఁ బ్రయోగించును. అవి పూలహారములై వారి కంఠములఁబడును.) ఔరా! అదియేమి యాశ్చర్యము? నాబాణములు పూలహారములైయుండునా? (కోపముతో) ఇప్పుడైనను మీ యజ్ఞానమును వదలెదరా లేదా! (అని నారాయణాస్త్రమును తొడఁగును.)

కుశ—(జనాంతికముగ) అన్నా! ఈయుగ్రాకారము కనుఁగొను మీలు మిట్లు గొలుపుచున్నది గదా? ఈ భయంకర తేజముచే మనకు బాణాసనముపై చేయియే పోవకున్నది కదా?

లవ—ఊరక మనతల్లి వద్దకు పోవుదమురమ్ము!

కుశ—(అస్త్రమును తొడిగి)

గీ. మహిని మాతల్లిలోకైక మాతయేని
ఆమె సత్కీర్తి జగముల నలరునేని
జనని మాజానకీదేవి సాధ్వియేని
ఇతఁడు నీయస్త్రమున మూర్ఛ నెనయుఁగాత.

శ్రీరామ—హా! జానకీ! జానకీ! (మూర్ఛపోవును.

[ప్రవేశము శీఘ్రముగ శూర్పణఖా కరాళులతో ఆంజనేయుఁడు శ్రీరామునివద్దకు వచ్చిచూచి]

ఆంజ—రామా! రామా! రామా! లోకాభిరామా! ఈదేవుఁడు మూర్ఛిల్లియుండుట కేమికారణ ముండవచ్చును? (బాలకులఁ జూచి) బాలకులారా! మీరేనా మారామచంద్రుని మూర్ఛ నొందించినవారు?

లవ—లేదయ్యా! అతఁడే యేలనో మూర్ఛిల్లియున్నవాఁడు.

ఆంజ—కల్ల మిమ్మువిడువను. చచ్చితి రిఁక నాముష్టిఘాతమున (అని చుమ్మెత్తును. లవకుశులు రామధ్యానముఁ జేయుదురు.)

(అనుబంధము 41)

[ఆంజనేయుఁడు నృత్యముఁజేయుచుండును. లవకుశులు రామధ్యానము చేయుచు నిష్క్రమింతురు. ఆంజనేయుఁడు వారిని వెంబడించును]
(యవనిక పడును.)



పంచమాంకము—చతుర్థరంగము.

స్థలము:—పర్ణశాల.

(సీతయు వాల్మీకులును కూర్చుండియుందురు.)

వాల్మీకి—అమ్మాయీ! ఇంతలోననే వత్తురు. నీకుమారుల కెందైన నాపదకలదా? ఊరడిల్లుము.
సీత—జనకా! ఇంతకాలము నన్నుఁబాలించితివి. రామదర్శనభాగ్యము నాకుఁ గలదా? లేదా?
వాల్మీకి—అమ్మా! అంతయుఁ దెలియఁగలదు. ఒక క్షణములో నీవు నీ నాథునితోఁ జేరుదువు. సత్యము. సంధ్యావందనముఁ దీర్చి వచ్చెదను. ఏమియు భయపడకుము!

(నిష్క్రమణము.)

[ప్రవేశము:—కుశకుమారుడు]

కుశ—తల్లీ! నమస్కారములు.
సీత—జయసిద్ధిరస్తు. కుమారా! నీతమ్ముఁడేడీ?
కుశ—అమ్మా! వెనుక వచ్చుచున్నాఁడు.
సీత—మీకు జయమే కలిగినదికదా?
కుశ—తల్లీ! అంతయు నీమహిమయే. అశ్వమును సాధించితిమి.
సీత—వారేమైరి? వారు శూరులేనా!
కుశ—లోకైక వీరు లనవచ్చును. వారు నీ వుపదేశించిన మంత్రము చేతనే మూర్ఛిల్లిరి. తుదకెవరో యొకమహాపురుషుఁడు నీలమేఘశ్యాముఁడు వచ్చెను. అతనిబాణాగ్ని మమ్ములనుఁ గాల్చుచుండెను. మేము నీధ్యానము నొనర్చితిమి. నీపేరు వినఁగానే యతఁడు క్రింద

పడిరి. అతనివద్ద నుండి యీమాణిక్యమును దెచ్చితిమి. (మాణిక్య మిచ్చును.)

సీత—(రిచ్చవడి మాణిక్యమునుచూచి) హా! రామా! రామా! (అని క్రిందపడును.)

కుశ—తల్లీ! తల్లీ! (అని శైత్యోపచారములఁ జేయును.)

సీత—(లేచి) కుమారా! ఆమహానుభావుఁడు, ఆనీల మేఘశ్యాముఁ డెచటనున్న వాఁడు? ఎట్లున్నవాఁడు? అయ్యో! అలనాఁడు మే మరణ్యమునకుఁ బోవునపుడు మాయత్త, కౌసల్యాదేవి రామచంద్రు నకు గట్టిన రత్నామణి కదా యిది?

కుశ—తల్లీ! తల్లీ! ఆరాముఁ డెవరు? నీవు శోకించుటకుఁ గారణ మేమి? తెలుపుము తెలుపుము, నీకు నమస్కరించెదను. తెలుపుము. (అని కాళ్ళఁ పడును.)

సీత—అయ్యా! అతఁడు మీ దైవము. మీగురువు. మీపాలకుఁడు.

గీ. మీదుదైవంబు మీదాత మీగురుండు
మీనిధానంబు భాగ్యంబు మీదుస్వామి
మీదుజీవంబు మీకల్మి మీధనంబు
మీకులాధ్యుండు మీతండ్రి మీకు లేడు.

కుశ—అమ్మా! మేము కలుషాత్ములమైతిమి. పితృహింసకుల మైతిమి. మాగతి యేమి? నీవేల మాకుఁ జెప్పకపోయితివి?

[ప్రవేశము—లవకుమారుఁడు పాడుచు; వెంట ఆంజనేయుఁడు]
(శూర్పణఖ కరాళులతో)

[అనుబంధము 42]

ఆంజ—(ఆశ్చర్యమున ఆహా! మాజానకీదేవి!! మాలోకమాత!!! మా తల్లి!!!! (నమస్కరించును.)

సీత—(దుఃఖముతో) అన్నా! మారుతీ! నీవెక్కడనుండి వచ్చితివి? మా రాముఁ డెందున్నాఁడు? ఆ దేవుఁ డెటులున్నాఁడు? చూచి తివా నీస్వామిని?

ఆంజ—తల్లీ! రామచంద్రుఁడు యుద్ధమునకు వచ్చినాఁడన్న యుదంత ము విని తపముఁ జేయుచున్న నేనాతని దర్శింపవచ్చితిని. రాముఁడు మూర్ఛిల్లియుండెను. ఈ బాలకులు సీతారామమంత్రముచే నన్ను గట్టివైచి నీయొద్దకు గొనితెచ్చిరి. వీరెవరు?

సీత—మారుతీ! పితృఘాతకులై నాయుదరమున దురదృష్టవశమున జనించినవారు.

ఆంజ— వీరు నీనందనులా? మాస్వాములుకదా వీరు? నాచిన్నప్రభు వులుకదా వీరు? నేఁడు ధన్యుఁడ. నేఁడు కృతార్థుఁడ.

(అని నమస్కరించును.)

సీత—అంజనాతనయా! మా రామచంద్రుని నాకుఁ జూపుమా. మా దేవ దేవునిఁ నాకుఁజూపుమా? అక్కటా! దిక్కులేక యునదనై యున్నను నతని క్షేమవార్త వినియైన సంతసించుచుంటినే? ఇఁక నాగతియేమి? నాకేది శరణము? హా! శ్రీరామా!

[ప్రవేశము—వాల్మీకి, జనకుడు.]

వాల్మీకి—జానకీ! జానకీ! భయపడవలదు. కుమారీ! నీనాథుఁడు నీపేరు విన్నమాత్రమున నధిక దుఃఖార్తుఁడై యున్న కారణమున మూర్ఛిల్లియున్నవాఁడు. ఈ కుమారులు నీకుమారులని తెలిసినం దున దుఃఖప్రేమాధిక్యమువలనఁ గలిగిన పారవశ్యముకాని వేరపా యముకాదు. పోదమురమ్మా రామచంద్రునొద్దకు కుమారులారా! మీజనకుని దర్శింతురు రండు.

జనక—తనయా! ఇదియే నీసంతోషసాధముఃఖద్వారము. నీకుఁ గలి గిన యవరోధమును మాని శుద్ధ మాయాస్వరూపిణివై వెలుగొం

దుము. లోకనాథులగు సీతారాములఁగాంచి జగము సంతసించు.
రమ్ము పోవుదము.

(ప్రవేశము—ఆంజనేయుఁడు శూర్పణఖా కరాళులతో)

ఆంజ—(వాల్మీకులకు నమస్కరించును.)

వాల్మీ—పావని! మంచివేళకు వచ్చితివి. నీవు లేని రామాయణము కలదా? పోదము రమ్ము.

(నిష్క్రమింతురు.)



## పంచమాంకము—పంచమరంగము.

### యుద్ధభూమి.

[(శ్రీ)రాముఁడు వరుండియుండును. జనకుఁడు కూర్చుండియుండును. వాల్మీకులు ప్రక్కనకూర్చుండి యభిమంత్రింతురు.]

శ్రీరామ—(లేచి) మునీంద్రా! వాల్మీకిచంద్రా! తమదర్శనము నాకెట్లుకలిగె? ఏరీ ఆకుమారులేరీ? త్రిలోకవీరులేరీ? జానకీ వరపుత్రులేరీ? చూపుమా. చూపుమా!

(ప్రవేశము, ఇరుప్రక్కలనుండి పాడుచు శీఘ్రయానమున లవ - కుశ కుమారులు.)

శ్రీరాము—కుమారరత్నములారా! శూరవతంసములారా! ఈపాతకుని నేల వేడెదరు? వీఁడు మీతండ్రికాఁడు, క్రూరుఁడు. కిరాతకుఁడు. హా! సీత! నాయంత్యకాలము సమీపించుఁగాబోలు! నామానసమును నాసర్వాంగములును తాపబాధితములై యున్నవి. లోకాపవాదమూలమునఁ నిన్నుఁ గన్నులారఁ జూడకున్నాఁడను, మదియందు నిన్నే ధ్యానించుచున్నవాఁడ.

వాల్మీకి—రామచంద్రా! పరమవిజ్ఞాన ధనులగు జనకరాజేంద్రులు మిమ్ము దర్శింపవచ్చియున్నారు.

శ్రీరామ—రాజేంద్రా! మి మ్మిందు దర్శించుటచే ధన్యుండనైతిని.
(అని నమస్కరించును)

జనక—రామా! నిన్ను దర్శించుభాగ్య మెన్నిజన్మములు తపమొనర్చిన గలుగవలయు?

[ప్రవేశము: శూర్పణఖా కరాళులతో ఆంజనేయుఁడు.]

ఆంజ—(శ్రీరామునకు నమస్కరించును.)

శ్రీరామ—అంజనాతనయా! నీవెప్పుడు వచ్చితివి? ఈ శూర్పణఖను నీవెట్లు తెలిసికొంటివి? ఆహా! జానకీ నిరపరాధవగుట జగమెఱిఁగి యున్నను నిన్నుఁ గటికమానసమున నడవిఁద్రోలిన నిర్భాగ్యుని నొకతూరి చూచుట మహాపాతకకార్యము. అయినను యేదీ నీ మోముదమ్మి నొకపరి నాకుఁ జూపుమా నా క్షమాపణఁ గైకొమ్ము.

[ప్రవేశము: సీత పాడుచు]

(అనుబంధము 43)

శ్రీరామ—(ఆలింగనము చేసికొని) జీవితేశ్వరీ! ఈ కుమారకహింస కనీ, నిండుగర్భిణిని నించుకంతయు నక్కటికము లేక బాధించిన పాపాత్మునిఁ జూడఁగల్గితివిగా? ఇదియే నీవరపురంధ్రీచారిత్రమును సూచింపుచున్నది. నన్ను మన్నింపుము. నాయపరాధముల మది నుంచకుము. అటులైన నాయంతర్దహనా పశ్చాత్తాపముతీరగలదు.

(అనుబంధము 44)

సీత—నాథా! అంతయు నా పూర్వార్జితఫలము; ఇందు నీ యపరాధ మేమున్నది. సర్వభూత దయామయుఁడవగు నీకిట్టి బుద్ధి కలుగ వలయునన్న నాగ్రహాచారము కదా!

ఆంజ—దేవా! ఇది మీయపరాధము కాదు. ఇదియంతయు నీ దురాత్ముల కృత్యము. (అని శూర్పణఖా కరాళులను చూపి) వీరు చాకలి వేషముల వేసికొని మిమ్ము మోసగించిరి.

వాల్మీకి—దేవా ! ఇదియంతయు నీకు శాపఫలముకాని వేరుకాదు. అది తీరిపోయినది. ఇది సమ్మోదకాలము ఈ కుమారులకు నా యెదుట యువరాజ పట్టాభిషేకము జేయుము.

జనక—సీతారాములారా! ఇపుడు మిమ్ముం గాంచితిని. నాఁడు మిథిలాపురమున మీ వివాహమునాఁడు మిమ్ముఁజూచుటచే గలిగిన సంతస మిప్పుడు కలిగినది. నా దౌహిత్రుల యువరాజ్యాభిషేక మహోత్సవము కన్నులార జూడవలయునని యున్నవాఁడ; దాని కనుమతింపుము.

శ్రీరామ—మునీంద్రా నా తమ్ములు ?

వాల్మీ—సందేహము లేదు. వారయోధ్యాపట్టణమున నప్పుడే మేల్కాంచియున్నారు.

శ్రీరామ—ఆంజనేయా ! ఈ శూర్పణఖా కరాళు లపరాధు లైనను నిట్టి సంతోష సమయమున దండింపరాదు. వీరి కభయమిచ్చి యున్నాఁడ.

(ఆంజనేయుఁడు శూర్పణఖా కరాళుల విడిచిపెట్టును
వారందరికిని నమస్కరింతురు)

లవ-కుశ కుమారులను కూర్చుండఁబెట్టి పట్టాభిషేకము జరుపుదురు.

(అనుబంధము 45)

మంగళము.



# అనుబంధములు.

1 మాల్కోస్ రాగము—చాపుతాళము.

అందఱు—కృపారామ - శ్రీరామ నారాయణా
అపారాగ - మోద్ధార - ఆలింపుమా॥ కృపా॥
మహాదైత్యసంహార - మానాయకా
మనోభక్త - సంరక్ష - మందారమా॥ కృపా॥
మునీంద్రా మనోవాస - దీనావనా
ఘనాధామ - శ్రీరామ - ఓరాఘవా॥ కృపా॥

2 నౌరోజు రాగము—ఏకతాళము.

అందఱు—ధరణిని-స్థిరంబు నేలు-రఘువర.
సుఖంబుగన్-జనంబులన్॥ రఘు॥
భరతు— ఖేదముల్-వాదముల్-భేదముల్-పోవగా-సాదరమతి స-
మ్మోదము చెలగఁ-సోదరులన-నెల్లరబ్రోవుముదయ॥ రఘు॥
శత్రుఘ్ను—ఇన్నాళ్ళకున్-కన్నారగా-నిన్నిందులఁ-కన్గొంటిమి
కలుషముచనె స-త్ఫలములు వెలిగెఁ-బలువెతలడగెఁ
రఘుకులాభరణా॥
ఆంజ— రామా-సురచిరదనుజ భీమా-రవికులదివర-కేమా-
రగనిలవెలయుఁ భూమిఁ-అది వర-కరుదుగ-ధరణిని
మనుపుము॥ రఘు॥
లక్ష్మణ—పరులై-సుఖతత్పరులై-పతిభక్తిరతలై-తగు సుందరులఁ-
మనువఁ-ఘనసతులై - తనరగ ధ-ర్మము నెపుడుఁ-నిలుపు
దయ్య-పన్నగ-నాదరమెన్నగ-నందర చెన్నగ - బ్రోచుచు-
సన్నుతరఘుమణి॥ ధర॥
సీత— వాణుల్-బుధగీర్వాణుల్-శృతినింద్రాణుల్-మణినింద్రార్ణం
బులున్-శుభంబు-సలలిత-సుఖంబులొసగుత- రఘు॥
శ్రీరామ—ఇందిర-రమణుడు నిటు-మమ్మిందు-ఆనంద-మలరఁగనిటు-
నొందింప-మీరంద-రనఘమదయ డెందంబు-మీరన్ - బ్రో

వగన్—ఎందు నేలెదక—అందముమీరస—మంద శుభోదయ
మెందును నొసఁగుఁడు॥

3 నాటకురంజిరాగము—ఆదితాళము.

సీత— ధీరమారుతీ రమ్మా—వీరాగ్రణి
కోరి రామువార్త నూర్మిఁ దెల్పినట్టి॥ ధీర॥
శోకసంద్రమందు—సొలసియున్న నన్ను
పీకబోర్చినట్టి—వాయుకుమార యిందు ధీర॥

4 మాల్ కోస్ రాగము—ఆదితాళము.

ఆంజ— అమ్మాకోతికి మణిహార—మదేలా
ఇమ్మారాముని—పాదభక్తిని॥ అమ్మా॥
రాముఁడె దైవము—రాముఁడెభావము—రాముఁడె ప్రాణము
రామనిధానము॥ అమ్మా॥
రామారాఘవరామ—శ్రీమంపుకరుణను
నామానసంబున—తిరముగ నిలుమా
నీమహిమంబును—నేర్చునే తెలియగ
ఇమ్మాజ్ఞానము—ఇనకుల భూషణ॥ అమ్మా॥

5 కాఫీరాగము—ఏకతాళము.

ఆంజ— కనుగొంటినాదైన దైవంబును
కనుగొంటి శ్రీరాము నభిరాముని॥ కను॥
కనుగొంటినాభాగ్య సుఫలంబును—కనుగొంటినాతపో
పుణ్యంబును—గనుగొంటిశ్రీరామ తత్వార్థము॥ కను॥
ధన్యుండనైతినే—మాన్యుండనైతిగా
చెన్నారనానోము—లీడేరెగా॥ కను॥

6 1 వ పాటయే.

వృషభగతిరగడ.

7 యదుకులకాంభోజిరాగము—ఆదితాళము.

రామ— కానజానకినూనసోనలు—కానకానగనయ్యెమానిని
సీత— తేనెవానలనూనమానగ—తేటులాటలపాటపాడవే

రామ—వారిసీరజవారమూరగ-నంచలంచుగసంచరించెగ
సీత—కోరిసారసకీరవార చ-కోరబృందమునందమొందెను
రామ—సీతశీతలకాంతగాత్రక-చిత్రిలాస్యము నేత్రిపాత్రిము
సీత—భీతవాతసుపోతవాిితము-నేతరించెనుసాతిమోదత
రామ—బాలబాలరసాలసాలపు-పాళులలరెనుపాలుపుమీరగ
సీత—నీలతాలతనూలజాలము-నిరతపాంథసుఖంబునించదె

సురటిరాగము—రూపకతాళము.

సీత— వనసీమ-కరుగగనా-కానతిచ్చిబోిివుమా
ప్రాణనాథమానుమనుచు-వలుకకుండ వేడుదాన॥ వన॥
రామ—ఎలనాగ-యీవాంఛ-వీలకలిగెనీకు-పలుబాధ
కలిగించు-బాలఘోరకాననంబు॥ ఎల॥
సీత—మునిభార్యలనుజేరి-మనసారనుండకోర్కె- మొనసె
నాకురామచంద్రి-కనికరంబుచూపుమా॥ వన॥
రామ—మొన్నగదా-మునిభార్య-లున్న కానమాననయ్యె
ఎన్నవలదీ కానికోర్కె-సన్నుతాంగి-వలదువలదు॥ ఎల॥

కేదారరాగము—రూపకతాళము.

సీత— దయగనుమా రమణా-తాపసాశ్రమంబుఁజేర॥ దయ॥
రామ—ఇదితగునా-లలనా-యేలయిట్టివాఁఛితంబు॥ ఇది॥
సీత— నా-థా-ఆ-లిం-పు-మా॥ దయ॥
రామ— బా-లా-మే-లా-యీ-లీ-ల॥ ఇది॥
సీత— కీడా-మేలా-పీడఁ-జాల-వేడుదాన॥ దయ॥
రామ—కాన-నంబు కాన-లేదె-మానుమింక॥ ఇది॥
సీత— మునిభా-ర్యలతో-ఘనలీల-లనే-గనగ మనువవె॥ దయ॥
రామ—వనజే-క్షణనీ-మనమీ-గతికిఁ-చనగ -వలయునె॥ ఇది॥
సీత— నమ్మినభామినితా -నెమ్మదికోర్కెలను-యిమ్మని
వేడగను-నొసఁగక మసలుట యుచితమె॥ దయ॥
రామ—సుందరియీగతినా-నందమె కానలనీ-వొందితి
మొన్ననుగా-అడుగక నుడుగుము పడతిరో॥ ఇది॥

సీత—— మానక-జాల-రామా
కానలకై నను-నేగగమనమానఁదలచితి॥ దయ॥

రామ——దైవా-యత్తం-బేమొ-
తలవఁగజాలను నే-తాపము-కలిగెనుతలపగ॥ ఇది॥

10 వసంతరాగము——ఆదితాళము.

శ్రీరామ——వల్క-జాలనే-పాపపుమాటల
పరమహేయముల్-పాతకముడరదె
మహాశోకమా-మానసమందుల
మాటలవెలికిని-దాటగనియ్యదు॥ వల్క॥

11 హిందుస్థాని జంఝూటిరాగము——ఏకతాళము.

లక్ష్మణ——నేమహాపాపుఁడనైతి-పరలోక-దూరుఁడనైతి-
అపయశం-బందనైతి
జననిరో-కాననంబుల విడిచిచనఁగనే-మనగఁజాలనే॥ నే॥
ఈమహాతాపమెటులోర్చు-పలకంగ నేటులనేర్చు
కలుషుఁడై-గర్భవతిని నే-కటికయడవి- నేగనగ త్రోయగా॥

12 మాంఢ్రాగముచాపుతాళము.

లక్ష్మణ——మాతయింత । వంతనిచ్చు । పాపుఁడు
ఇంతవన్నా । మదినికరుణ । చూడకే॥ మాత॥
అంతమొంద । శాపమిచ్చి బ్రోవనే
సుతసంబు గల్గునాకు । అమ్మరో॥ మాత॥

సీత—— అన్ననింద । లెన్నొయొందు । నాయెంగా
ఎన్నఁడామె । కరుణరాముఁ । డేలకో॥ అన్న॥
ఉన్నవృత్తము । తెలియఁడామె । కన్నారగ
అన్నియాశ । లట్టిపోయె । లక్ష్మణా॥ అన్న॥

13 ధన్యాసిరాగము——రూపకతాళము.

లక్ష్మణ——అమ్మరో । అడవి నెట్లు విడతునే
నెమ్మనంబు । తల్లడిల్లె॥ అమ్మరో॥

సీత—— లక్ష్మణా! । చింతయేలమానుమా।నాదుప్రాప్తి।ఇట్లులుండ॥ల॥

లక్ష్మణ——తల్లీ, వనటగిలిగె పెల్లైవిడచి చనగలనె పుడమి! అమ్మరో
సీత—— సౌ-మి-త్రీ-శ్లో-కం-బే. లా-నీకు
లక్ష్మణ——ఈరేడు-జనులున్-మునులున్-సురులున్-చూడంగ
అనలంబున నీవెనయవె-మాయమ్మ-పరసాధ్వినిన్
అటవిన్-త్రోయించి-మనగన్-గలనెజనని॥ అమ్మరో॥
సీత—— నాదునోసటనిటులన్-విధి వ్రాయుమటికలదే-ఇదినాదు
పూర్వజన్మ-పాపమిక మదినడలకుమా?

14 ముఖారిరాగము——రూపకతాళము

లక్ష్మణ——నీ కరుణచే మముకడున్- నరసితిజనని-వరప్రేమను
మమ్మరయఁగా-కంటిమోజనకతనయ-మనమున
శోకముకలిగెనుఁ అమ్మరో॥
సీత—— మాయన్న-ఘనపరముగ-నాసేవ-సలుపుదుగద
వేభక్తి-బలువనములనాకింక-సేవల్-ప్రమోదమున
సలుపన్-మహాత్ములెవ రిటు చెపుమా శుభ మొదవును-
ననుమది మఱువంగవలదు॥ లక్ష్మణా॥

ముఖారిరాగము——రూపకతాళము

లక్ష్మణ——నీకెయ్యో-దిక్కు-నెవరు-యీవనంబునందు-తల్లిరో॥ నీకెయ్యో॥
లోకజనని-నీకీగతి-శోకముకలిగెనుసకటా
కీకాటవి-కావుడయ్యా-ప్రకటసురవర్యులారా॥ నీకెయ్యో॥
పరమసాధ్వి-నీదుకోడలి-నరయునీకు-నవ్వగింతు
కరుణనీవె-చూడుమయ్యా-ధరణిదశరథావనీశ॥ నీకెయ్యో॥

15 రాగము——తాళము

వాల్మీకి——మానుమింక తాపము జానకీ
ప్రాణనాథు కానవౌను-భామినీ॥ మాను॥
లోకమాత-నీవెయేల శోకము
వ్యాకులంబు మానుమమ్మ-పావనీ॥ మాను॥
వెతలుబోవ సుతులగనెదు అతివరో
పతిని జేరి-సుఖముగందువమ్మరో॥ మాను॥

16 సావేరి రాగము—ఆదితాళము

సీత—రఘురామ-మనుపుమా-రామా
ఎందు నేనీముఖ-చందురుగాంతునో
ఎందునీవగ బాయుదు॥ రఘు॥
ఇనకులభూషణ-వేలుమా- దీనను రాగదే-రామా
రామా॥ రఘు॥

17 కమాజు రాగము—ఏక తాళము.

లవ— } వరసరోజలోచన రామ-రఘుకులాబ్ధిసుర చిర
కుశ— } సోమ రఘురామ-పరంధామ । అరిభీమా॥ వర॥
ధరణిజామనోంబుజకామా । సురవరావదభిరామా
దయగనుమా । మదిగానుమా వర నామా॥ వర॥

18 జంఝూటి రాగము—ఏక తాళం

లవ— } ఏలనమ్మాయిటు । దురంతచింత
కుశ— } చాలశోక । మొంద నేల । దురంతచింత॥ ఏలమ్మా॥
కుశ— కన్నులనీరిటు । కారగ నేల । మన్నన దెల్పవె । మమతచె
తల్లిరో॥ ఏలమ్మా॥
లవ— తనయులమమ్మేల । గనియిటుశోకము । కనగను
నేలను । వినుమదిజననిరో॥ ఏలమ్మా॥

19 కన్నడ రాగము—ఆది తాళము

లవ—యిటుపికిపలుకు వినకమ్మా ఇది సరులకుండ తగదమ్మా ॥ఇటు॥
బాణము చేకొని వైరుల జంపక మానిన క్షత్రియుఁడా నే॥ఇ॥

20 శామకల్యాణి రాగము—ఆది తాళము

లవ— } రఘురామునిచరితమును । వినుమమ్మా యిఁక॥ రఘు॥
కుశ— } రామునిసీతా । రామునిఁ దలచిన । పాపముతొలగునుగా.
లవ—ఖరదూషణాదులను । ఖండించెనుగద
వాలినికోలను । కూలఁగ నేసెను
రాముఁడు రాముఁడుగా రఘు॥

కుశ—జనకాత్మజనుకూడ-జగమెల్లఁ బరి
పాలనసేయు-భవ్యుఁడు రాముఁడు-
నారదవంద్యుఁడుగా॥ రఘు॥
లవ—ధరరావణునిదునిమి-దయచేన్నారెను
రాముఁడు వేదారాముఁడుకలిగిన-కొంతుకలుగునుగా॥

21 శంకరాభరణము—ఏకతాళము.

జనక—విడువిడుబాలక-మృగమునుబట్టకు
వినోదమా-యిది-ప్రమోదమా॥ విడు॥
ఘనతరమా-గనతరమా
చూడఁగవేడుక-కాదిదితలఁపగ
వినోదమా-యిదిప్రమోదమా॥ విడు॥

22 హిం-తోడిరాగము—ఏకతాళము.

కుశ—దుడుకుసపలుకకుమా-యెడరునగు
కడుకొనిమృగమును-నెడరున సడుగకు॥ దుడుకు॥
కాలరుద్రుఁడగు-నేమికావగా-కాలపూనకటునావల
పోమ్మా-చాలనింకవడి-వరుగిడుపలుకక॥ దుడుకు॥

23 మధ్యమావతిరాగము—రూపకతాళము.

బాలకులు—రారవేటలాడుదమురారా। వేడుకలరగా
బలుసింగంబులనెల్లఁ । నలుముచుపులులను వేగ
కలచినలచి । వెతలపఱచి । జగముఁబెనచి । ముదము
పెంచఁగా॥ రార॥
ఘనకుంజంబులలోనఁ । ఘనమహిషంబులమరియు
కరులమెలుల తలలదునిమి పులులనదిమి।భరముడించఁగా॥రా॥
కలకాలంబును నేఁతో । జనములనలచెడివానిఁ
కదలనియక।మెదలనియక।వడలిచనక।చెదరచంపఁగ ॥రార॥

24 కాఫీరాగము—ఏకతాళము.

శత్రుఘ్న—నినుమదమణచెడ పలువా। గనుమా
రామునియెడ నీ। రాయిడిచెల్లునె। భూమిని నీవికబ్రి

దుకవుపోరా।శరం।బిడేనినుకా।హరింపగ వెలసినురా
పలువా । గనుమా॥ సిను॥
కావరమందుచునీవిటువహాయము । లావునబట్టితి
దశక్రవుకూ్రరాజ।సం।బులుకా।గనకా।నినుకా।యిలగూ
ల్చెదరా । కనుమా ॥పలువా॥

25\. కమాజు రాగము—ఆదితాళము.

శత్రుఘ్న—బాలకచాలవు । ఆలమునకా
కాలమాతీరెను । కానవురా॥ బాలక॥
లవ— ఏపునచూపుము । శౌర్యమును
ఈపరిమాటలు । నోపవురా॥ ఏపున॥
శత్రుఘ్న—శూలియడరినకా । స్మరక్రణగింతు
లవ— ఏల । ఇటుల । బీరము । వల్కెదు
కాలుని । చెంతకు । సంపెదను
శత్రుఘ్న—చాలునునీవిక । చచ్చితిరా
లవ— నీమానము । పాృణము । నీగెదురా

26 పీల్ రాగము—ఏకతాళము.

సీత— సుకుమార । రణమునచనితే
శోకంబే । గతితాళుదున
ధరనే । గతినే । మనఁగలదాన॥ సుకు॥
సొగసగునగవె । న్నడుగనుదాన । చెక్కిలినొక్కనే
ముద్దిడుదాన । చెలువా । పలుకె । న్నడువినుదాన॥ సుకు॥

27 శ్యామకల్యాణిరాగము—రూపకతాళము.

కుశ— వాఁడెవ్వాఁడు । నొంతునేఁడు । పట్టితెత్తు పేరువాడి
పాదముచేర్తునే । ప్రాణములతీర్తునే॥ వాఁడె॥
ఇంద్రుఁడైన। యుపేంద్రుఁడైన। మించిదుృంచి నొంచివైతు
శోకమేలనమ్మరో । వీకవంపుతల్లిరో॥ వాఁడె॥

28 కాఫీరాగము—ఆదితాళము.

కుశ— ఏపలువా। కొనుచుచనెనో। పలుకుడికనేవాని।
మదమణతుణ॥ ॥ఏపలువా॥
పటుతర। శరముల। పాయఁగఁజేతుణ
పటుతర। యురమును। చీలఁగఁజేతుణ
అటునిటుకదలక। పదములవిరుతుణ॥ ఏపలువా॥

29 తోడిరాగము—ఏకతాళము.

కుశ— ఓరోరోరీ। నిలునిలుమిఁక పోగరడచెద భూమివరణమందుణ
కరంబునిటునిణ। విరోధగతిచే ధరణవడగణ
మడియింతుణ॥ ఓరో॥

శతృఘ్న—బాలా। మేలా
కుశ— పోరణ। రారా
శత్రుఘ్న—బాలూడ, వీలాగు। ఆలంబు। చేయంగ చాలుదె
బాలక। పోలునేరా.
కుశ— ఇటులణ। పలుకణ। నగునే। పోగరే.
శత్రుఘ్న—వైరంబునీ। కేమయినణ। పోరాఁడగా। ధీరుండవే
నీవు। శూరుండవే॥ ఓరో॥

30 కల్యాణిరాగము—ఆటతాళము.

లవ— సమరమందు। శౌర్యముణ। మీరణ చూపుమా। ఓపుమా
కుశ—సవనవాజినాజిలో। శక్తిచూపనిత్తుము॥ సమర॥

31 కల్యాణిరాగము—ఏకతాళము.

లక్ష్మణ—చాపలేటికిమీకుసీగతి। పవరమును। చాలింపుఁడు
సైపలేరుప్రతాపవహ్నిని। చటులబాణపరంపరల్ ॥చాప॥

32 కల్యాణిరాగము—ఏకతాళము.

లవ— నృపులకెందుయుద్ధమే సామ। మోక్షమా ధర్మమా
కుశ— నృపుఁడ క్షత్రియుండవు నీకుఁ జెప్పవారమే॥ నృపుల॥

33 కల్యాణిరాగము—ఆటతాళము.

లక్ష్మణ—మీరుక్షత్రియులౌదురే । మిముఁగన్న ధన్యులెవ్వరు
మిమ్ముఁగన్న యశమ్ముఁనొందిన । నేటివంశము నేదోకో

34 కల్యాణిరాగము—ఏకతాళము.

లవ— కులమునూరు పేరు నీ కేలా । బంధువీ వౌదువే
కుశ— వినుము జన్మపత్రికల్ । వేడ్క వ్రాయువాఁడవే॥ కులము॥

35 కల్యాణిరాగము—ఏకతాళము

లక్ష్మణ—వీరక్షత్రియులైన శూరుని । బలమునీటు యోచింపుడు
తారతమ్యమెఱుంగకిట్టుల । మీరినిల్వఁగ పాడియే॥ వీర॥

36 బిల్హరిరాగము—ఏకతాళము.

లక్ష్మణ—పుడమిపడగ । వేయఁజాలనే
కుశ— పొగరా ?
లక్ష్మణ—తగురా ? ♦ లవ— సగరా ?
లక్ష్మణ—బాలులంచు నూరకుంటి
కుశ— ఏలగర్వమడరెనీకు
లక్ష్మణ—నిలుము నిలుము । పలుకులార్చెదన్
లవ— చనుమా
లక్ష్మణ—వినుమా ♦ కుశ— కనుమా
లవ— పలుకులేల సనుపుబాణముల్ ।
కుశ— మెచ్చన్ । నచ్చన్ । నిన్నున్
లక్ష్మణ—శరములింక నురమువెడలి ధరణిచేరుచూడరా
తరమెనిలువ । రణముసేయుఁగా । కలరా । మీరన్ । గలరా

37 హిం-జంఝూటిరాగము—ఏకతాళము.

లక్ష్మణ—వీరుఁడైన శక్తియున్న । యుద్ధమందుఁబోరఁజాలి । నిల్వుమా
కుశ— బీరమేల బాలులంచు । పల్కనేఁ ధీరుఁడౌచు । పోరుమా
లక్ష్మణ—కాలాహితో వైరమేల । కాలంబుతీరినదిగా
లవ— ఈలాగు ప్రేమంబునీకేలనూ । చాలించి గైకొమ్ము । బాణంబులన్
లక్ష్మ—ప్రాణంబ-నంగ-మా-నొనుచూడుఁడీ-మనలేరుచూడుఁడీ॥ వీరు॥

38 ఇంగ్లీషునోటు - ఏకతాళము.

ఆంజ— ఇదె ధరన్ బడన్ పడన్ నడంతునిండె దుష్టులన్
ఖలులనొంతు । ద్రుంతుమింతు ! వంతనొందఁజేసెదన్
ఏ । పా ! రన్ । దైత్యులిట్టుకట్టడిన్ ।
సలుపదలచి । కలతపరచి । ఖలతసలిపిరే॥ ఇదె॥

39 కళ్యాణిరాగము—ఏకతాళము.

ఆంజ— నేనెందు కానసైతి । జానకిన్ గానసైతి ।
దీనతనొందనామె । ప్రాణంబు మానెనామె,
శ్రీరాముసెట్లుగాంతు । యేమని విన్నవింతు॥ నేనెందు॥

40 ఇంగ్లీషునోటు—రూపకతాళము.

ఆంజ— పడుఁడిందూరక

శూర్ప } విడుమమ్మూర్ఖ
కరా }

ఆంజ— పాపాత్ములైతిరి.

కరా } తప్పుల సైరింపు
శూర్ప }

ఆంజ— మెడసలిమెద మిమ్మింక.

కరాళు } దయవిడువుము మొక్కెదము
శూర్ప }

ఆంజ— పలుకకుడోతులువల్

కరా } ఘనకరుణను మనుపుము
శూర్ప }

41 శంకరాభరణరాగము—ఏకతాళము.

లవ— రామారామా । రఘువరరామా । రాఘవరామా
దానవభీమా । జగదభిరామా । తారకనామా ।
దశరథరామా॥ రామా॥

42 శంకరాభరణరాగము—ఏకతాళము.

ప్రేమాధామా । ముఖజితసోమా । సురచిరధామా
మునిజనధామా । వేదారామా । వైకుంఠధామా ।
రామా రామా రామా॥ రామా॥

43 బేహాగ్‌రాగము—ఆదితాళము.

కుశ—జనకా । ప్రేమనిమ్మా తనయుల మము చేకొమ్మా
లవ—తండ్రి రామాదగు । తప్పుల సైరిచి । తసర దయ
రానిమ్మా॥ జనకా॥
కోపము చేనిటు । పాపముఁ జేసితి । కొమరుగ
మముఁ జేకొమ్మా॥ జనకా॥
సీత— కరుణించి పా । లింపుమా । ఆలింపుమా । నాథా॥ కరు॥
ఎన్నుచు నీమది । మన్నన జేయవె । సన్నుత రఘుమణి
న్యాయమా । భారమా । ఉదారమా
గంభీరమా । నా । థా॥ కరు॥

44 పూరికల్యాణిరాగము—ఆటతాళము

రామ— కామినికరుణింపవె । కాంతరొనీకిటు
సంతాపము చేకూర్చితి॥
జానకి యీకానల । పోనాడిన హీనుఁడనే
మానక కాపాడవె । సీత భువిజాత యిటు॥ కామిని॥

45 మోహనరాగము—ఏకతాళము

కమలా । నాథా । విమలవిభా । కమలా । వాసా కలుషహరా
వ్రముదా। భాసా। వరఫలదా। కమలా । నాభా । ఘనకరుణా॥
కరివరదా। సురవినుతా । హరివదనా । మురహరణా । సురు
చిర। నార। దాదివంద। నీయ। శ్రీ॥ కమలా॥
సామలోలా। సాధుపాలా । వేదలీలా । సారలీలా। భాను
జాలా । మందరధారణ । మానివిభావన। కారణ సత్కరు
ణా। ను। బ్రి। హ్మ। ణ్య వందితా॥ కమలా॥

మంగళం.